# నాస్తికులు - ఆస్తికులు




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# నాస్తికులు-ఆస్తికులు

రచయిత : త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ.శ్రీ.శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-40    ఐదవ ముద్రణ : ఏప్రిల్-2018

ప్రతులు : 1000    **వెల : 50 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
92) బ్రహ్మ-రావణబ్రహ్మ-భగవాన్ రావణబ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మమునకు రక్షణ అవసరమా?
95) వేదములు మనిషికి అవసరమా?
96) ఉపనిషత్తులలో లోపాలు.
97) సుప్రసిద్ధి బోధ.
98) సిద్ధి బోధ.
99) సత్యార్థ ప్రకాశికలో సత్యమెంత.
100) రూపము మారిన గీత.
101) సున్న.
102) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక ప్రసంగములు

*(DVD'S)*



01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు–అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్–అలక్‌నిరంజన్.
05. మాయకుడు–అమాయకుడు.
06. తల్లి తండ్రి–గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ–పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం–దేహం మోహం.
11. ఎదమీదముద్ర–తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు–రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు–ఆరు–తొమ్మిది.
15. మాయ మర్మము– ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం–లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము–మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు–ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం– తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం– రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు–కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు–అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్టి-సృష్టికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.

82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మావిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఈశ్వర-పరమేశ్వర.
135. పురుషోత్తమ-శ్రీరామ.
136. దేవునికి ఒక్కడే కుమారుడు-
దేవునికి అనేకమంది కుమారులు.
137. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 7989100433, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా





**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# నాస్తికులు - ఆస్తికులు

ఆస్తి అనగా సంపద అని అందరికీ తెలుసు. స్థిరాస్థులుగానీ, చరాస్తులుగానీ కలవానిని ఆస్తిపరుడు లేక ఆస్తికుడు అంటున్నాము. సంస్కృత భాషలో 'కాదు' అను అర్థమునకు 'న' అను అక్షరమును చెప్పుచుందురు. ఆస్తిపరుడు కాడు అను అర్థమునకు న ఆస్తికుడు అనెడివారు. న+ఆస్తికుడు అను వాటిని కలిపి పలికితే నాస్తికుడు అగును. నాస్తికుడు అంటే ఆస్తిలేనివాడను అర్థమగును. ఆస్తికుడు నాస్తికుడు అను పదములను నేటికాలములో ధనమున్నవానికి, ధనము లేనివానికి ఉపయోగించడము లేదు. దైవభక్తి కలవానిని ఆస్తికుడని, దైవభక్తి లేని వానిని నాస్తికుడని పిలువడము జరుగుచున్నది. ఇంకనూ ఆలోచిస్తే హేతుబద్ధముగా, శాస్త్రబద్ధముగా దైవవిషయములను ప్రశ్నించిన వానిని నాస్తికుడని, మూఢనమ్మకము కలవానిని, గ్రుడ్డిగా ఆచరించువానిని ఆస్తికుడని అనడము జరుగుచున్నది. ఇంకనూ ఆలోచిస్తే ఎర్రగుడ్డలు వేసుకొన్న వారిని ఆస్తికులని అనడము, ఎర్రజెండాలు ఎత్తుకొన్నవారిని నాస్తికులనడము జరుగుచున్నది. ఇప్పటి కాలములో మనుషులు ఆస్తికులు, నాస్తికులను రెండు తెగలుగా విభజింపబడియున్నారు. మాతెగ వేరు మీతెగ వేరన్నట్లు ఆస్తికులు మాట్లాడిన దానిని నాస్తికులు ఖండించడము, అట్లే నాస్తికులు మాట్లాడిన దానిని ఆస్తికులు ఖండించడము ముఖ్యమైన పనిగా జరుగుచున్నది. ఈ విధముగా ఆస్తికులు, నాస్తికులు ఇద్దరూ శాస్త్రబద్ధతను మరచిపోయి ఒకరినొకరు ఖండించుకోవడమే ముఖ్య ఉద్దేశ్యమైపోయినది.

నాస్తికులు మాట్లాడిన మాటలలోగానీ, అడిగిన మాటలలోగానీ, శాస్త్రబద్ధత ఉందా లేదా అని చూడకుండానే వారి మాటలను ఖండించడము ఆస్తికులకు అలవాటైపోయినది. అలాగే ఆస్తికుల మాటలలోగానీ,

బోధలలోగానీ, శాస్త్రబద్ధతను చూడకుండానే ఖండించడము నాస్తికులకు అలవాటైపోయినది. ఈ రెండు వాదనలలో సామాన్య మనిషి దేనిని అనుసరించాలో తెలియక కొంత తికమకపడుచున్నాడు. పూర్తి ఆలోచించిన వానికి కొన్ని విషయములందు నాస్తికులలో స్వచ్ఛత కనిపిస్తున్నది, మరికొన్ని విషయములలో వారి వాదనకు పొంతనే కుదరకున్నది. అలాగే ఆస్తికుల విషయానికొస్తే కొన్ని విషయములు సత్యమనిపించిన మరికొన్ని విషయములు పూర్తి అసత్యముగా కనిపిస్తున్నవి. ఎవరూ చూడని దేవున్ని, ఎవరికీ తెలియని దేవున్ని, మానవ జీవితములో ఎవరి అనుభవానికీ రాని దేవున్ని మేము చూచాము అను ఆస్తికుల మాటలు పూర్తి అసత్యమని, శాస్త్రబద్ధముకాని మాటలని తెలియుచున్నది. ఈ విషయములో ఆస్తికులను ఖండించి నాస్తికులను సమర్థించవచ్చును. జాదుగర్ ఆనంద్ (మాంత్రికుడు ఆనంద్) జన సమూహము చూస్తుండగా తన మంత్రశక్తితో ఏనుగును ఒక్క క్షణములో మాయము చేసినపుడు మంత్రములు లేవు అను నాస్తికుల వాదనను ఖండించి మంత్రములు ఉన్నాయను ఆస్తికుల వాదనను సమర్థించవచ్చును. ఈ విధముగా రెండు వర్గములలోనూ కొంత సత్యము, కొంత అసత్యము ఇమిడి ఉన్నది. రెండు వర్గములలోనూ ఒకే విధముగా సత్యాసత్యములు ఇమిడి ఉండుట వలన, చివరకు రెండూ ఒకే ఫలితము లోనికి పోవుట వలన, సమాజమునకు సంశయములేని మార్గమును చూపక సంశయమునే కల్పించి, ఎటూ తేల్చుకోలేని సందిగ్ధములో పడవేయుట వలన, రెండు విధానములు ఒకే వర్గమునకు చెందినవేనని చెప్పవచ్చును.

ఆవుకు పులికి సరిపడదని, ఆహారములోనూ, జీవన విధానము లోనూ విభిన్నతను కల్గియున్నవని అందరికీ తెలుసు. వీటిని వేరువేరు వర్గములని చెప్పవచ్చును. ఒకచోట ఆవు కనిపించినది, మరియొకచోట

పులి కనిపించినది. ఆవును పులిని వర్గభేదముతో చూచినప్పటికీ పులి నిజముగ పులికాదనీ అది కూడ పులితోలు కప్పుకొన్న ఆవు అనీ తెలిసినపుడు రెండు ఒకే వర్గమునకు సంబంధించిన ఆవులని చెప్పవచ్చును.

గోవులు, గోముఖ వ్యాఘ్రములు రెండూ ఒకటేనని తెలిసినట్లు ప్రస్తుతము ఇప్పుడు సమాజములోనున్న వారు ఆస్తికులా నాస్తికులా అని మరియు ఆస్తికులవలెనున్న నాస్తికులా అని యోచించి చూడవలసిన అవసరమున్నది. ఎవరు ఆస్తికులు? ఎవరు నాస్తికులు? ఇపుడున్న రెండు గుంపులనూ కలిపి నాస్తికులనాలా? లేక ఆస్తికులనాలా? వీటికి జవాబు కావాలంటే నాస్తికులకు ఆస్తికులకు నిర్వచనము చెప్పుకొని, ఆ నిర్వచనము ప్రకారము ఇపుడున్న వారెవరో తేల్చిచెప్పవచ్చును.

కంప్యూటర్లలో హార్డువేర్, సాఫ్టువేర్ ఉన్నది అందరికీ తెలిసిన విషయమే. హార్డువేర్ లేని సాఫ్టువేరుగానీ, సాఫ్టువేర్‌లేని హార్డువేర్‌గానీ ఉన్న కంప్యూటర్లు లేవు. అలాగే సూక్ష్మము, స్థూలము లేని జగతియే లేదు. సూక్ష్మము లేని మనిషిగానీ, అలాగే స్థూలములేని మనిషిగానీ జగతిలో లేరు. కంప్యూటరుకు హార్డువేర్, సాఫ్టువేర్ ఉన్నట్లు మనిషికి తప్పనిసరిగా స్థూల, సూక్ష్మములుండవలసినదే. మనిషికి స్థూలముగనున్నది శరీరము, సూక్ష్మముగానున్నది ఆత్మ. స్థూలముగనున్న శరీరము 24 భాగములుగ ఉండగా, సూక్ష్మముగనున్న ఆత్మ మూడు భాగములుగా ఉన్నది. స్థూలము అనగా కనిపించెడిది, సూక్ష్మము అనగా కనిపించనిదని అర్థము. అలాగే ప్రపంచములో కనిపించెడి ధనము ఉన్నట్లు, కనిపించని ధనము కూడా కలదు. కనిపించెడి ఆస్తిని బట్టి ఆస్తిపరుడు అన్నట్లు, కనిపించని ధనమును బట్టి కూడా ఆస్తిపరుడు అనవచ్చును.

పూర్వము కనిపించని ఆస్తి అయిన జ్ఞానధనమునుబట్టి జ్ఞాన ధనమున్న వానిని **"ఆస్తికుడు"** అనియూ, జ్ఞానధనము లేనివానిని **"నాస్తికుడు"** అనియూ సంబోధించెడివారు. కనిపించెడి ధనమును దొంగలు దోచుకోవచ్చును, పురుగులు తినివేయవచ్చును. కానీ జ్ఞానధనమును దొంగలు దోచుకోలేరు, పురుగులు తినలేవు. ప్రపంచధనము అశాశ్విత మైనది, చనిపోయినపుడు వెంటరానిది. జ్ఞానధనము శాశ్వితమైనది, చనిపోయిన జీవునితోపాటు పోవునది. అందువలన పూర్వము జ్ఞానధన విషయములలోనే ఆస్తికుడు, నాస్తికుడు అని మనిషిని పెద్దలు నిర్ణయించెడి వారు. ఈ లెక్క ప్రకారము ప్రపంచములో ఎవరు నాస్తికులు? ఎవరు ఆస్తికులు? అని లెక్కించితే, దేవుడు లేడనువారికి ఎటూ జ్ఞానధనముండదు కావున అటువంటి వానిని నాస్తికుడని సులభముగా చెప్పవచ్చును. వారు కూడా మేము నాస్తికులమే అని ఒప్పుకొంటారు. జ్ఞానధనము కల్గిన ఆస్తికులను గుర్తించడములోనే పెద్దసమస్య గలదు. దేవుడు లేడనువారు ప్రత్యక్షముగ కనిపించు ఆవులలాంటివారు. ఇకపోతే పులితోలు కప్పుకున్న ఆవులను గుర్తించడములోనే పెద్దసమస్య గలదు. కనిపించని దేవున్ని చూచామని చెప్పు పీఠాధిపతులు, ఎవరికీ తెలియని దేవున్ని మీకు చూపుతామను గురువులు, అప్పుడప్పుడు మా శరీరములోనికి దేవుడే వచ్చి మీతో మాట్లాడి ఆయన చూపును మీమీద ప్రసరింపజేస్తాడని ప్రచారము చేయుచున్న కొన్ని సమాజముల స్వాములు, స్వామినులు, మేమే సాక్ష్యాత్తూ దేవుళ్ళమని చెప్పుకొను బాబాలు, ఎందరో భక్తులు ఆస్తికులను పేరుతో చలామణి అగుచున్నారు. జ్ఞానధనమును బట్టి చూస్తే నూటికి తొంబై తొమ్మిదిమంది కూడా జ్ఞానధనము లేనివారే అగుట వలన అందరినీ ఆస్తిలేని వారని నాస్తికులని చెప్పవచ్చును. ఆస్తి లేకున్నను ఆస్తికులమని

పేరుపెట్టుకొన్నవారు పులి కాకున్నను పులితోలు కప్పుకొని పైకి పులి మాదిరి కనిపిస్తున్న ఆవులేనని చెప్పవచ్చును. వెయ్యికి ఒక్కరు కూడా అరుదుగా జ్ఞానధనము కలవారున్న ఈ కాలములో హేతుపద్ధతి ప్రకారము చాలమటుకు అందరూ నాస్తికులే. స్వాములను, గురువులను, పీఠాధిపతులను, బాబాలను, పెద్ద భక్తులను నాస్తికులనడములో కొంత విచిత్రముగ నున్ననూ ఉన్న వాస్తవము అంతే! నిజమైన జ్ఞానధనము కలవారు లక్షకొకరో, కోటికొకరో ఉండవచ్చును. అటువంటి వారిని మాత్రమే ఆస్తికులు అనడములో అర్థము గలదు.

"దేవుడే లేడనువారు కనిపించు నాస్తికులైతే, దేవుడున్నాడని చెప్పుచున్న కనిపించని నాస్తికులు ఎందరో ఆస్తికులుగ ఉన్నారని మీరను చున్నారు. పెద్దపెద్ద స్వాములను, బాబాలను, పీఠాధిపతులను, గురువులను ఏ ఆధారముతో నాస్తికులనుచున్నారు? వారివద్ద జ్ఞాన ధనము లేదనుటకు ఆధారమేమిటని" కొందరడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! బ్రతికిన మనిషికి దేవుడు తెలియడను మాటను బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము చెప్పవచ్చును. దేవుడు మనిషికి తెలియకుండినప్పటికీ దేవుని జ్ఞానమును మనిషికొరకు శాస్త్రబద్ధముగా దేవుడే తెలిపియున్నాడు. బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతలో దైవజ్ఞానము సంపూర్ణముగా తెలుపబడి యుండగా, దానిని విస్మరించి శాస్త్రబద్ధతలేకుండా మాట్లాడువారివద్ద జ్ఞాన ధనము లేదని చెప్పవచ్చును. వేదములు గుణముల ప్రతిరూపములనీ, వాటిని వదలితేనే సరియైన మార్గము లభించునని **గీతలో చెప్పిన దైవ వాక్కును మరచి వేదములకు ప్రాధాన్యతనిచ్చు వారివద్ద జ్ఞానధనముండదని చెప్పవచ్చును. బాహ్యాయజ్ఞముల వలన, వేదములధ్యాయణము వలన, దానముల వలన, తపస్సుల వలన దేవుడు తెలియబడుటకు శక్యము కాదని**

**గీతలో చెప్పగా వాటినే గొప్పగా తలచి యజ్ఞములను చేయు స్వాములు, వేదపఠనముగావించు పీఠాధిపతులు, తపస్సులు చేయు గురువులు, దానములు చేయు భక్తాగ్రగణ్యులు దారితప్పిన వారు కాదా!** నిజముగా జ్ఞానధనములేని నాస్తికులు కారా? బ్రహ్మవిద్యా శాస్త్రమునకు వ్యతిరేఖముగా బోధించువారు, ప్రజలకు సంశయములు తీర్చలేనివారు, హేతుబద్ధముగా జవాబివ్వనివారు ఎంతటి ఆస్తికులుగా కనిపించినా, నిజముగా నాస్తికులు కారా? దేవుడు లేడని చెప్పువారు మాత్రమే నాస్తికులని, దేవుడున్నాడని చెప్పువారు ఆస్తికులని చెప్పుట పొరపాటు. జ్ఞానధనము లేనివారందరూ ఆస్తికులు కారని, నాస్తికులేనని చెప్పుట సరియైన మాట. జ్ఞానధనములేని వారు పెద్ద స్వామీజీలైనా నాస్తికులేనని చెప్పవచ్చును.

కనిపించెడి ధనమును బట్టి వీడు ధనికుడు, వీడు ధనికుడు కాడని చెప్పవచ్చును. కనిపించని జ్ఞానధనమును బట్టి వీడు నాస్తికుడు, వీడు ఆస్తికుడని ఎలా గుర్తించగలమని కొందరడుగవచ్చును. దానికి సమాధానమేమనగా! కనిపించని జ్ఞానధనమును గూర్చి తెలియాలంటే దేవుని యొక్క ధర్మములు తెలియాలి. దేవుని ధర్మములు ఒక్క భగవద్గీతలోనే గలవు. గీతలోని ధర్మములను తెలిసినపుడే అందులో చెప్పబడిన జ్ఞానాగ్ని విషయము తెలియును. గీతలో అనేక సందర్భములలో చెప్పబడిన జ్ఞానాగ్నియే మనమనుకొను కనిపించని జ్ఞానధనము. "జ్ఞానమను అగ్ని కలవాడే నిజమైన సన్యాసి, నిజమైన యోగి" అని గీతలో చెప్పబడినది. **జ్ఞానాగ్ని లేనివాడు ఎంత పెద్ద స్వామి అయినా అబద్ధమైన సన్యాసి, అబద్ధమైన యోగి అనియే చెప్పవచ్చును.**

ప్రపంచధనము మనిషికి అవసరాలను తీర్చి సుఖాలను అందివ్వ గలదు. అలాగే జ్ఞానధనము మనిషియొక్క కర్మలను తీర్చి మోక్షము

నివ్వగలదు. దీనిని గురించి **"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్"** అని గీతలో చెప్పబడినది. గీతలోని ధర్మములను తెలిసి ఆచరించువాని దగ్గర తప్పక జ్ఞానధనముండును. గీతధర్మములకు వ్యతిరిక్తముగా నడచువారందరి వద్ద జ్ఞానధనముండదని చెప్పవచ్చును. **"గీతను ఎందరో స్వాములు, పీఠాధిపతులు, గురువులు ఎంతో చక్కగా బోధిస్తున్నారు కదా! వారిని కూడా మీరు నాస్తికులన్నారు కదా! వారికి ధర్మములు తెలియవంటారా"** అని కొందరడుగ వచ్చును. దానికి మేము చెప్పునదేమనగా! గీతను చదివినంత మాత్రమున ధర్మములు వారికి తెలుసుననుకోవడము పొరపాటు. వారు ధర్మములు తెలిసిన వారైతే బాహ్యయజ్ఞములు ఎలా చేస్తున్నారు? దైవ ధర్మములు తెలిసినవారైతే వేదాధ్యయణమెందుకు చేస్తున్నారు? అన్య దేవతారాధన చేయువారు ధర్మములు తెలిసినవారెలా అగుదురు? ధర్మములు తెలియనిదే జ్ఞానధనముండదు. ధర్మములు తెలిసినవాడు ధర్మముల ప్రకారమే నడుచుకొనువాడై ప్రత్యేకముగా కనిపించగలడు. అటువంటివానినే జ్ఞానధనుడని, వానినే ఆస్తికుడని అనవచ్చును. జ్ఞానధనముండాలంటే దైవధర్మములుండాలి. ధర్మములు ఆచరణలో కనిపించునవి కావున ఆచరణను బట్టి జ్ఞానధనమున్న వానిని కనిపెట్టవచ్చును. **ధర్మాచరణ కల్గినవాడు సమాజములో స్వామికాకున్నను నిజమైన స్వామియే, వాడు నిజమైన ఆస్తికుడే. అలాగే ధర్మాచరణ లేనివాడు స్వామియైనను వాడు నిజమైన స్వామికాడు, వాడు నిజమైన నాస్తికుడే.**

మీరు నాస్తికులను, ఆస్తికులను తెలియాలంటే ముందు గీతలోని నిగూఢమైన ధర్మములు తెలుసుకోండి. వాటిని తెలిసి ఆచరించి మీరు కూడా జ్ఞానధనముగల ఆస్తికులుగా మారవచ్చును. అంతేకాక దేశములో ఆస్తికుల ముసుగులో ఉన్న వారిని కూడా నాస్తికులుగా గుర్తించవచ్చును.

దేవుడులేడను వారికి నాస్తికముద్రవేసి తాము ఆస్తికులమనుకొను వారికి కనువిప్పు కల్గించవచ్చును. దైవధర్మము తెలిసి ఆచరించనివాడు ఎప్పటికీ ఆస్తికుడు కాలేడని, నాస్తికుడుగా ఉండవలసిందేనని చాటి చెప్పవచ్చును.

నేటికాలములో కొందరు హేతువాదులు తమచుట్టు తమ నిర్ణయము సరియైనదను ఒక కంచెను తయారుచేసుకొని, ఆధ్యాత్మికము అన్నది భ్రమ అంటున్నారు. ఆధ్యాత్మికమును నమ్మకములతో కూడుకొన్న చిక్కుసమస్య అని కొట్టివేయుచున్నారు. ఆధ్యాత్మికము సైన్సుకు సంబంధించిన విషయమే కాదంటున్నారు. అటువంటివారందరూ తమ నిర్ణయమును పునరాలోచించు కోవలసియున్నదని మేము కోరుచున్నాము. ఎందుకనగా! ఇంతవరకూ ఆస్తికత్వములో ఎన్నో కల్పితములు, పురాణ విషయములనుచూచి వారలా అని ఉండవచ్చును. కాని యోచించి చూచితే ఆధ్యాత్మికమే ఒక పెద్దసైన్సు. ఆధ్యాత్మికము ఆరుశాస్త్రములలో గొప్పది మరియు ఆరవదైన బ్రహ్మవిద్యా శాస్త్రము. శాస్త్రము సిద్ధాంతములతో కూడుకొన్నది, సిద్ధాంతములు విజ్ఞాన రూపముతోనే ఉండును. కనుక సిద్ధాంతవరమైన ఆధ్యాత్మికమును సైన్సనియే చెప్పవచ్చును. ఇపుడున్న ఆస్తికులు యజ్ఞములను బయట ఆచరించి ఏదో జరుగుతుందని చెప్పడము మూఢనమ్మకములతో కూడుకొన్న పని. దానిని హేతువాదులు ఖండించవచ్చును. అదే యజ్ఞములు శరీరములో నిత్యము జరుగుచున్నవని చెప్పడము, ద్రవ్యయజ్ఞము అందరిలో నిత్యము జరుగుతుందని చెప్పడము సిద్ధాంత వరమైన శాస్త్రవచనము. ద్రవ్యయజ్ఞము ఎట్లు జరుగుచున్నదని హేతువాదులు యోచించవలసి యున్నది. నిజముగా జరుగుచున్న ద్రవ్య యజ్ఞమును విజ్ఞానము (సైన్సు) తో కూడుకొన్న విషయమని తెలియకనే మూఢనమ్మకమని కొట్టివేయడము మనకు తెలియని సైన్సును సైన్సే కాదన్నట్లుండును. అందువలన విజ్ఞానముతో కూడుకొన్న

హేతువాదులు కొంత పరిశోధన చేసి నిరూపణాత్మకముగా ఖండించడము మంచిది. అట్లుకాక నమ్మకమై ఉంటుంది అని మూఢముగా నమ్మి కొట్టి వేయడము హేతువాదులలోని మూఢనమ్మక మగును. గ్రుడ్డిగా శాస్త్రబద్ధత లేకుండా ఖండించడము వలన హేతువాదులనుకొనువారు కూడా ఒక విధముగ మూఢనమ్మకము గలవారే అగుదురు. **ఒక సత్యమైన విషయమును శాస్త్రీయముగ సమర్థించువారు, ఒక అసత్య విషయమును శాస్త్రీయముగానే ఖండించవలెను.** అందువలన ఆధ్యాత్మికమును సైన్సుకాదని కొట్టిపారవేయక ఆధ్యాత్మికము నుండే సైన్సు పుట్టినదని తెలియాలి. ధర్మము అనునది ఆధ్యాత్మికము నుండే పుట్టినది, సైన్సు ప్రకారము ఒక్కొక్క వస్తువు ఒక్కొక్క ధర్మము కల్గియున్నదని చెప్పుచున్నాము. సిద్ధాంతము ఆధ్యాత్మికము నుండే పుట్టినది, సైన్సు ప్రకారము సిద్ధాంతములతో కూడుకొన్నదే శాస్త్రమంటున్నాము. ఆధ్యాత్మికమునుండే శాస్త్రము పుట్టినది, సైన్సుప్రకారము నిరూపణకు వచ్చునదే శాస్త్రమంటున్నాము.

భూమికి గల ఆకర్షణశక్తి భూమియొక్క **ధర్మము** అగును. ఆ ధర్మమును కనుగొన్నపుడు అది **సిద్ధాంతమగును.** ఆ సిద్ధాంతము ఆచరణ రూపముగ జరగడము **శాస్త్రమగును.** ధర్మము సృష్ట్యాది నుండి ఉండును. కనుగొన్నపుడు సిద్ధాంతములగును. ఆచరించినపుడు శాస్త్రములగును. భూమ్యాకర్షణ శక్తి మొదటినుండి గల ధర్మమే. దానిని న్యూటన్ అను వ్యక్తి కనుగొన్నపుడు అది సిద్ధాంతమైనది. ఆ సిద్ధాంతము ఆచరణకు జరుగుచున్నది. అందువలనే శాస్త్రము జరిగితీరునని, శాస్త్రము యొక్క మొదటి పేరు శాపమని, శాపము తప్పక జరిగి తీరునని, శాపము యొక్క రూపాంతరమే శాస్త్రమని తెలియాలి. హేతువాదులు జాగ్రత్తగా ఒక విషయమును అనేక కోణముల నుండి పరిశోధించి చూచాకే

మూఢనమ్మకమా, శాస్త్రబద్ధమా అని తేల్చి చెప్పాలి. మరొక ముఖ్యమైన విషయమేమంటే **నమ్మకమనునది ఒక ఆరోపణలాంటిది. ఆరోపణ నిజము కావచ్చును. లేక అబద్ధము కావచ్చును. నమ్మకము కూడా సత్యము కావచ్చును, అసత్యము కావచ్చును. నమ్మకము అసత్యమైనపుడు మూఢనమ్మకమగును, సత్యమైనపుడు శాస్త్రసమ్మతమగును.** అంతేగానీ నమ్మకము అంటేనే కొట్టిపారవేయకూడదు. నమ్మకము మీద ఎన్నో సత్యములు ఆధారపడి ఉన్నాయి. ఉదాహరణకు తల్లి తండ్రి నమ్మకము అయినప్పటికీ అది సత్యము. దానినే శాస్త్రబద్ధము అంటున్నారు. అలాగే కులము, మతము అనునవి నమ్మకము అయినప్పటికీ వాటిని పరిశోధించి చూచితే అసత్యము, కావున వాటిని మూఢ నమ్మకమనవచ్చును. నమ్మకము మూఢనమ్మకము కావచ్చును, హేతుబద్ధము కావచ్చును. అందువలన నమ్మకమన్న వెంటనే దానిని కొట్టివేయ వద్దండని, పరిశోధించి నిరూపణకు రాని విషయమైనపుడు దానిని ఖండించవచ్చునని తెలుపుచున్నాము.

మానము అనగా కొలత అని అర్థము. ఒక పదార్థము యొక్క నిర్ధిష్ట కొలతను పరిమానము అంటున్నాము. కాలమును గురించి చెప్పునపుడు కాలమానము అంటున్నాము. కాలమానమనగా కాలము యొక్క కొలత అని అర్థము. అలాగే మనిషి విషయములో చూస్తే మనిషికి ఒక హోదా లేక గొప్పతనము అనునవి ఉంటాయి. హోదా లేక గొప్ప తనమనునవి ఒక్కొక్కనికి ఒక్కొక్క కొలతలో ఉండును. మనిషి మనిషికీ గొప్పతనము లేక విలువలో కొంతైనా తేడా ఉండును. ఏదైనా ఒక విషయములో తన విలువకు భంగము కల్గినపుడు అక్కడ నా మానము పోయిందంటాము. ఇక్కడ కూడా మానము పోయిందంటే మనిషి యొక్క విలువకున్న కొలత తగ్గిపోయిందని అర్థము. ఈ విధముగా అనేక

విషయములలో మానము అన్న పదము ఉపయోగపడుచున్నది. ఒక వ్యక్తికున్న విలువను బట్టి అతనికి ఎదుటివాడిచ్చు గౌరవమును మర్యాద అంటుంటాము. మానము, మర్యాద లేని మనుషులు కూడా జగతిలో గలరు. మానముంటేనే మర్యాద ఉండును. మానము లేకపోతే మర్యాద కూడా ఉండదు. మానము యొక్క స్థితి గతులను వివరముగా తెలుసుకొంటే ఇంకా ఈ విధముగానున్నవి.

ఒక మనిషికున్న మానముకంటే ఎక్కువగ పోల్చుకొని ఎదుటి వాడు గౌరవవించడమును **'అభిమానము'** అంటాము. అలాగే ఒకనికున్న మానమును గుర్తించలేకున్నపుడుగాని లేక మానము ఉందోలేదో తెలియనపుడు వానియెడల గలుగు దానిని **'అనుమానము'** అంటాము. నిర్ధిష్టముగ తెలియు కొలతను **'పరిమాణము'** అనుచున్నాము. ఉన్నదాని కంటే ఎక్కువగా పోల్చుకోవడమును **'అభిమానము'** అంటున్నాము, ఉన్న దానికంటే తక్కువగా పోల్చుకోవడమును **'అవమానము'** అంటున్నాము. మానమును గురించి అంచనా లేనపుడు దానిని **'అనుమానము'** అంటున్నాము. ఈ మూడు విధములైన మానములు ఒక వ్యక్తిపట్ల గానీ ఒక వస్తువుపట్ల గానీ ఉండుట సహజము. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును అదేమనగా! మనిషి నడవడికను బట్టి, ప్రవర్తనను బట్టి అవమానము, అభిమానము, అనుమానముండవచ్చును కానీ వస్తువుకెలా ఉండునని అడుగవచ్చును. దానికి జవాబేమనగా!

మానము, అవమానము, అభిమానము, అనుమానములు జీవములేని వాటికి కూడా ఉండునని తెలియుచున్నది. ఉదాహరణకు ఒక ఆకారమున్న ప్రతిమను గురించి చూచితే, సమాజములో ప్రతిమకు కొంత విలువ ఉండును, దానినే ఆ ప్రతిమకున్న మానము అనవచ్చును.

ఆ ప్రతిమను కొందరు గౌరవించి పూజించుటవలన దానిపట్ల కొందరికి మర్యాద గలదని చెప్పవచ్చును. 1) ప్రతిమల పట్ల ముస్లిమ్‌లు తక్కువ అంచనాతో వ్యతిరేఖముగ ఉందురు కావున వారి దగ్గర ప్రతిమకు అవమానముగలదని చెప్పవచ్చును. 2) కొందరు ఆ ప్రతిమనే చాలా గొప్పగా ఆరాధించుట వలన దానియెడల వారికి చాలా అభిమానమున్నదని కూడా చెప్పవచ్చును. 3) ప్రతిమల విలువను ఏమాత్రము అవగాహన చేసుకోక, వాటి విషయము ఏమాత్రము తెలియక, ఎటూ తేల్చుకోలేక, మొదటికే కొట్టిపారవేయు నాస్తికులలో ప్రతిమలపట్ల అనుమానమే మిగిలినదని చెప్పవచ్చును. ఈ విధముగనే జీవమున్న మనుషులను వారికున్న విలువను అంచనా వేసుకోలేక అనుమానించడము కూడా జరుగుచున్నది. అట్లే విలువను తక్కువ అంచనా వేసుకోవడము వలన అవమానించడము, ఎక్కువ పోల్చుకోవడము వలన అభిమానించడము కూడా జరుగుచున్నది. దీనినిబట్టి చూస్తే ఎదుటివారి విలువను (మానమును) గ్రహించడములోని విధానముల వలననే అవమానములు, అభిమాన, అనుమానములు గలవని నిరూపణకొస్తున్నది.

తనకంటే వేరుగనున్న ప్రాణముగల, ప్రాణములేని వాటికిచ్చు కొలతగల విలువలను బట్టి మనుషులను మూడు విధములుగ విభజించ వచ్చును. ఒకటి అవమానించువారు, రెండు అభిమానించువారు, మూడు అనుమానించువారు. ఈ ముగ్గురినే దూషణ, భూషణ, తిరస్కారులు అంటున్నాము. అవమానించువారిని దూషణులని, అభిమానించు వారిని భూషణులని, అనుమానించువారిని తిరస్కారులని అనవచ్చును. ఇంకొక విధముగ అవమానించువారిని దూషించువారిని నాస్తికులనీ, అభిమానించు వారిని కీర్తించి ఆరాధించువారిని ఆస్తికులనీ, అనుమానించి తిరస్కరించు

వారిని విమర్శించువారిని హేతువాదులనీ లెక్కించవచ్చును. వీరిని మనిషి విషయములో దూషణ, భూషణ, తిరస్కారులని చెప్పినప్పటికీ దేవుని విషయములోనికి వచ్చేటప్పటికి నాస్తికులు, ఆస్తికులు, (విమర్శకులు) హేతువాదులని చెప్పవచ్చును. నాస్తికులకు, ఆస్తికులకు మధ్యలోనున్న వారు హేతువాదులు. ఎందుకనగా దేవుని విషయములో హేతుబద్ధతను తెలిసినపుడు హేతువాదులు ఆస్తికులుగా మారవచ్చును. అలాగే హేతు బద్ధతను తెలియనపుడు నాస్తికులుగా మారవచ్చును.

ఒక మనిషి ఉన్నపుడే వానిపట్ల అభిమానము, అవమానము, అనుమానము ఉండును. అలాగే దేవుడు ఉన్నపుడే ఆయన పట్ల ఆస్తికము, నాస్తికము, హేతువాదము ఉండును. విశ్వములో కనిపించే మనిషి గలడు, అలాగే కనిపించని దేవుడు గలడు. ఇప్పటి కాలములో మనిషి దేవునిపట్ల తన ఆస్తికత్వమును, నాస్తికత్వమును ఎలాకలిగి ఉన్నాడో వివరించు కొందాము. ప్రస్తుత కాలములో దేవుని సమాచారము ఏమిటో, దేవుడెవరో, దేవుని గొప్పతనము ఏమిటో, దేవుడంటే అర్థమేమిటో, దేవుని పరిమాన మేమిటో తెలియని వారందరూ ఆస్తికులుగా చలామణి అగుచున్నారు. దేవుని స్థానములో ఎందరో దేవతలను సృష్ఠించుకొని వారినే దేవునిగా చెప్పుకోవడము వలన అసలు దేవుడెవరో అర్థము కాకుండా పోయినది. షట్ శాస్త్రములలో బ్రహ్మవిద్యాశాస్త్రమై నిలచినది భగవద్గీతయని తెలియని వారెందరో స్వాములుగా చలామణి అగుచూ, గీతను ప్రమాణముగా తీసుకోక పోవడము వలన అసలైన దేవుని విషయము తెలియకుండా పోయినది. దైవవిషయములు శాస్త్రబద్ధత కల్గిన జ్ఞానమని తెలియనివారు అనేక విధముల వారి వారి బోధలను ప్రచారము చేసుకొనుట వలన 'దేవుడు' అన్న పదమునకు అర్థము లేకుండా పోయినది. ఒక్కొక్క గురువు ఒక్కొక్క

విధముగా బోధించుట వలన ఒకరికొకరికి పొంతన లేకుండా పోయినది. ఎంతోమంది స్వాములు వారికిష్టమొచ్చినట్లు వారికి తోచిన విధముగా శాస్త్రబద్ధత ఉందా లేదా అని చూడకుండా చెప్పుటవలన దైవత్వమునకు నిర్ధిష్టమైన ప్రమాణము తెలియకుండా పోయినది. **జ్ఞానము అనుపేరుతో అజ్ఞానము, స్వాములు అనుపేరుతో దైవ వ్యతిరేఖమైన మాయ ప్రతినిధులు ఉన్నారని చాలమందికి తెలియదు.** మాయకు ప్రతిరూపాలై దైవత్వమను పేరుతో మాయతత్వమును బోధించువారు, ఆస్తికులమని పేరు పెట్టు కొన్నప్పటికీ వారు దైవధనము లేని నాస్తికులే.

ఆలోచనాశక్తి గల కొందరు శాస్త్రసమ్మతముగాని లోపభూయిష్టమైన ఆస్తికత్వమును చూచి ఇదా దైవత్వము? ఎవరు దేవుడు? అని ప్రశ్నించుకొని వారి ప్రశ్నలకు ప్రత్యక్షముగా ఉన్న ఆస్తికులలో జవాబు లేదని వారంతకు వారు ముద్రవేసుకొని, దేవుడే లేడని మేము నాస్తికులమనుకొనుచున్నారు. ఆస్తికత్వము అంటే ఇపుడున్న పద్ధతేనా అని నాస్తికులు యోచించడము లేదు. ఇపుడున్న వారందరు పైకి ఆస్తికులమని పేరు పెట్టుకొన్నప్పటికీ తమవలె నాస్తికులేనని, వారు ఆచరిస్తున్నది ఆస్తికత్వము కాదని తెలియ కున్నారు. ఆస్తికుడు అంటే నిర్ధిష్టమైన అర్థమేమైనా ఉందేమోనని ఆలోచించ కుండా స్వాములను, భక్తులను ఆస్తికులనుకోవడము నాస్తికుల పొరపాటు. దేవుడొకడున్నాడని తెలిసినపుడే ఆయనకు విలువ ఉంటుంది. మనుషులు ఆయన విలువను తెలుసుకొన్నపుడే ఆయనకు మర్యాద ఉంటుంది. మానమున్నపుడే మర్యాద ఉండునను సూత్రము ప్రకారము దేవుని గొప్పతనము తెలిసినపుడే ఆయన మీద అభిమానముండును. ఆయనను గురించి తెలియక, ఆయన పేరుమీద తమకిష్టమొచ్చిన వారిని దేవుళ్ళుగా పోల్చుకున్నపుడు అసలైన దేవునిమీద ధ్యాసయే లేకుండును కదా! దేవుని

గూర్చి తెలియని ఆస్తికులు జ్ఞానధనము లేనివారే కనుక వారు కూడా నాస్తికులే. ఒక విధముగా ఆస్తికులు, నాస్తికులు ఒక కోవకు చెందిన వారే, అనగా జ్ఞానధనము లేనివారే. ఒకరేమో మట్టిని సంచిలో నింపుకొని ధనమని మురిసిపోవుచూ ఆస్తికులమని పేరుపెట్టుకొన్న నాస్తికులు. మరొకరేమో ఖాళీసంచిని పట్టుకొని మాదగ్గర ధనములేదు, అది మాకువద్దు అనువారు నాస్తికులు. ఈ విధముగా ఆస్తికులు నాస్తికులు ఒకే కోవకు చెందినవారు కాగా, హేతువాదులు కొంత విభిన్నముగనున్నారు.

హేతువాదులు ప్రతీ విషయమును విజ్ఞానముతో (సైన్సుతో) ముడి పెట్టుచూ, తమకు తెలిసినది మాత్రమే విజ్ఞానమనుచు, తమకు తెలియనిది విజ్ఞానమే కాదంటున్నారు. దేవుని విషయానికి వస్తే నాస్తికులవలె కాకుండా సైన్సు ప్రకారమైతే ఒప్పుకొంటాము. సైన్సు ప్రకారము కానిదానిని ఒప్పుకోము అని అంటున్నారు. చివరకు ఆధ్యాత్మికము, దేవుడు సైన్సు కానేకాదు, కేవలము నమ్మకము మీద ఆధారపడిన విషయములని కొట్టివేయుచున్నారు. ముఖ్యముగా దేవున్ని సైన్సు ప్రకారము నిరూపిస్తే ఒప్పుకుంటామనీ, అలా మమ్ములను ఎవరూ ఒప్పించలేరంటున్నారు. కానీ హేతువాదులు సైన్సు ప్రకారము దేవుడు లేడని ఒప్పించగలమా? అని ఆలోచించలేదు. ఒక విధముగా నేటి ఆస్తికులు హేతువాదులను ఒప్పించలేని మాట నిజమే. ఎందుకనగా! ఆస్తికులకు శాస్త్రమంటే (సైన్సు అంటే) ఏమిటో తెలియదు. అంతమాత్రముననే దేవుడు హేతుబద్ధుడు కాదని హేతువాదులు చెప్పుట సరియైన మాట కాదు. నేటి ఆస్తికులు చెప్పు పుక్కిడిపురాణములు సైన్సుకు నిలబడునవి నిరూపణకు వచ్చునవి కావు. పురాణములు చెప్పు విషయముల ఆధారముతో ఆధ్యాత్మికము, దేవుడున్నాడనుమాట విజ్ఞానము (సైన్సు) కాదని హేతువాదుల వాదన సమంజసమే అనిపించినప్పటికీ ఇక్కడ

కొన్ని ప్రశ్నలు ఉత్పన్నము కాగలవు. అవేమనగా! ఆస్తికుల మాటలు నిరూపణకురాని నమ్మకములు మాత్రమేనని చెప్పు హేతువాదులు, తమ పరిశోధనల ద్వారా ఆధ్యాత్మికములోని విషయములను పరిశోధించి పరిశోధనకు తేలనివని ఎందుకు చెప్పకూడదు? ఎల్లప్పుడూ ఆస్తికులు చెప్పిన మాటలను కేవలము నమ్మకములని కొట్టివేయడము తప్ప, తమకు తెలియని శాస్త్రబద్ధత ఏదైనా ఉన్నదేమోనని ఎందుకు చూడకూడదు? **'యోగశాస్త్రే'** అని పేరుపెట్టబడిన భగవద్గీతలోని విషయములను శాస్త్రబద్ధముగా ఎందుకు శోధించకూడదు? షట్ శాస్త్రములని పేరు గాంచిన ఆరుశాస్త్రములు శాస్త్రవేత్తలమనుకొను, హేతువాదులకు తెలుసునా? శాస్త్రములు మూడేనని చెప్పుట హేతువాదులలోని మూఢనమ్మకము కాదా! తమకు తెలిసినవే శాస్త్రములు, తెలియనివి శాస్త్రములు కాదనవచ్చునా? అష్టాదశ పురాణములను ఖండించవచ్చును కానీ షట్ శాస్త్రములను హేతువాదులు ఖండించగలరా? ఆరు శాస్త్రములు ఒకదానితో ఒకటి ముడిబడి ఉండగా వాటి అనుసంధానమును సైన్సు ప్రకారము కాదనగలరా? తమకు అర్థముకానంత మాత్రమున భగవద్గీతనే కల్పితమని చెప్పు హేతువాదులు గీతలోని విషయములను విజ్ఞానరూపముగ శాస్త్రము కాదని నిరూపించగలరా? తమకు జీవశాస్త్రము తెలుసునను హేతువాదులు, జీవాత్మ అను విషయమును ఎందుకు కొట్టివేయుచున్నారు? ఎన్నో విషయములకు పూర్తి సమాధానము తెలియకనే ఏదో ఊహతో చెప్పు హేతువాదులు మూఢనమ్మకము కలవారు కాదా?

ఏదో ఒక భక్తి గలవారందరూ మేము ఆస్తికులమనుకొని పొరబడినట్లు, ఏవో కొన్ని విషయములను విజ్ఞానరూపముగా తెలిసినంత మాత్రముననే మేము హేతువాదులమని కొందరు పొరపడుచున్నారు.

నిజమైన ఆస్తి ఏమిటో నేటి ఆస్తికులకు తెలియనట్లు, నిజమైన హేతుబద్ధ మేమిటో నేటి హేతువాదులకు తెలియదు. దీనిని బట్టి నేటి ఆస్తికులు ఆస్తికులు కారు, అట్లే నేటి హేతువాదులు హేతువాదులు కారు వృథావాదులే. నేటి ఆస్తికులను, హేతువాదులను ప్రశ్నిస్తూ శాస్త్రబద్ధమైన విషయములను తెలిసినపుడే నిజమైన ఆస్తికులు, నిజమైన హేతువాదులు కాగలరని తెలుపుచున్నాము. సృష్టి ఆదిలో మొదటపుట్టిన శాస్త్రము దైవశాస్త్రము. దానినే బ్రహ్మవిద్యాశాస్త్రము మరియు యోగశాస్త్రము అని అంటున్నాము. మొదట పుట్టిన యోగశాస్త్రము దేవునికి సంబంధించినది, కావున దానిని స్వయముగా దేవుడే సూర్యగ్రహమునకు చెప్పాడు. సూర్యగ్రహము కనిపించుటకు మండే గోళము, అది దాని స్థూలాకారము. జీవమున్న ప్రతి దానికీ సూక్ష్మము కూడా ఉండును. విషయమును గ్రహించునది కావున దానిని 'గ్రహ' అన్నాము. ఆనాటి దైవప్రోక్తమైన మొదటి శాస్త్రమును సూర్యగ్రహము గ్రహించి తర్వాత భూమి మీద ఉన్న మానవులకు తెలియజేసినది. మొదట భూమి మీదకు సూర్యుని ద్వార వచ్చిన శాస్త్రమే యోగశాస్త్రము. అదియే తిరిగి ద్వాపరయుగ అంత్యములో శ్రీకృష్ణ భగవంతుని ద్వారా తెలియబరచబడినది. తర్వాత మిగత ఐదుశాస్త్రములు మనిషి స్మృతిలో మెదలి బయటపడినవి. మనిషినుండి బయటపడిన ఐదుశాస్త్రములు ప్రపంచమునకు సంబంధించినవి మాత్రమే. తర్వాత వేదములు, ఉపనిషత్‌లు, పురాణములు తయారైనవి. శాస్త్రముల తర్వాత వచ్చిన వేదములు మానవుని తలలోని గుణములకు ప్రతీకలై నిలచినవి. ఈ వేదములే యోగశాస్త్రమునకు కనిపించని శత్రువులై నిలచినవి. దేవున్ని వేదముల ద్వారానే తెలుసుకోవచ్చునను భ్రమను కల్గించి మానవున్ని మభ్యపెట్టినవి. మనిషి దైవ జనితమైన యోగశాస్త్రమును వదలి ప్రకృతి

జనితమైన వేదముల వెంటపడ్డాడు. పూర్వకాలమునుండి వేదములను జీర్ణింప చేసుకొని, వాటికంటే మించినవి లేవని, దైవశాస్త్రమును విస్మరించాడు. నేటికినీ దైవప్రోక్తమైన భగవద్గీతను లెక్కచేయక వేదములను పూజ్యములుగా పెట్టుకొన్న ఎందరో స్వామీజీలు పీఠాధిపతులు గలరు.

ఇక్కడొక ప్రశ్న పాఠకులకు రాగలదు అదేమనగా! వేదములకంటే ముందు పుట్టినవి శాస్త్రములు కదా! వాటిలోనూ ముందు పుట్టినది యోగశాస్త్రముకదా! ఆ తర్వాత పుట్టినవి వేదములన్నారు కదా! అటువంటపుడు ముందులేని వేదములను గురించి గీతలో ఎందుకు చెప్పారు? గీతలో వేదముల ప్రస్తావన వచ్చినది కావున గీతకంటే ముందే వేదములున్నవని తెలియుచున్నది కదా! దీనిని బట్టి గీత ఆదిలో పుట్టినదని తర్వాత చాలా కాలమునకు వేదములు పుట్టినవను మీమాట అసత్యమగును కదా! అని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! వేదములు పుట్టక ముందు ఆదిలోనే యోగశాస్త్రమైన గీత పుట్టినది. ప్రకృతికి సంబంధించిన ఐదు శాస్త్రములు పుట్టకముందు మరియు నాల్గు వేదములు పుట్టకముందు పుట్టినది దైవశాస్త్రమైన దేవునిచే చెప్పబడిన యోగశాస్త్రము. ఆదిలో దైవ ప్రోక్తమైన శాస్త్రమును యోగశాస్త్రమనెడి వారు. గీత అని, భగవద్గీత అని ఆనాడు యోగశాస్త్రమునకు పేరులేదు. ఎందుకనగా! ఆనాడు భగవంతుని చేత చెప్పబడలేదు కావున భగవద్గీత అను పేరులేదు. మొదట చెప్పబడిన యోగశాస్త్రములో వేదముల ప్రసక్తేలేదు. ఆనాడు వేదములే లేవు, కావున వేదముల ప్రసక్తి లేదు. ఆనాడు యోగశాస్త్రములో దేవుని విషయములు మాత్రము గలవు. వాటి ఔన్నత్యమును గ్రహించలేని మానవులు కాలక్రమమున యోగశాస్త్రము యొక్క విషయములను వదలి వేదముల వలలో పడిపోయారు. ద్వాపరయుగ అంత్య కాలమొచ్చేటప్పటికి దేవుడు

చెప్పిన యోగశాస్త్రధర్మములకు ముప్పు ఏర్పడినది. మానవుడు వేదము లందు ఆసక్తివరుడై దైవధర్మములను విస్మరించాడు. ఆనాడు ఋషులు, సన్న్యాసులు, తపస్వికులు దైవమార్గము కాని యజ్ఞములు, దానములు, వేదాధ్యయణములు, తపస్సులను ఆచరించను మొదలు పెట్టారు. ఆ సమయమున దేవుడు తన ధర్మములను కాపాడుకొనుటకై తిరిగి తన శాస్త్రమును అందరికీ తెలియునట్లు చేయుటకుపక్రమించాడు. ఆ ప్రయత్నముతోనే యోగశాస్త్రమును ద్వాపర యుగమున భగవద్గీత రూపముతో చెప్పాడు.

ద్వాపరయుగములో చెప్పినది మానవుడైన అర్జుననకు, కావున చెప్పెడివాడు కూడా మానవుడై ఉండాలి. అందువలన దైవాంశ కృష్ణునిగా పుట్టి భగవంతుడైనది. భగవంతుడు చెప్పినది కావున యోగశాస్త్రమునకు ద్వాపరయుగములో భగవద్గీత అని పేరు వచ్చినది. ఆదిలో యోగ శాస్త్రమును సూర్యునికి చెప్పినపుడు వేదముల ప్రస్తావన అందులో లేదు. లేనివాటిని గూర్చి చెప్పవలసిన అవసరము ఆనాడు లేదు. కాలము మారుకొలది వేదములు పుట్టి వాటి ప్రాబల్యము ఎక్కువ కావడము వలన ద్వాపరయుగ అంత్యములో చెప్పిన భగవద్గీతలో వేదములను గూర్చి చెప్పవలసి వచ్చినది. వేదములు మాయకు ప్రతిరూపములని చెప్పినప్పటికీ మానవులు వినేస్థితిలో లేరని మరియు చెప్పువాడు దైవాంశగల భగవంతుడైనా పైకి మానవుడే కావున కృష్ణున్ని కూడా తప్పుపట్టి ఆయన మాటను లెక్కించరని తలచి, గీతను బోధించునపుడే చెప్పినవాడు స్వయముగ దేవుడే అని తెలియునట్లు, దైవము తన విశ్వరూపమును చూపాడు. విశ్వరూపములో నుండి చెప్పిన ముఖ్యమైన మాటలలో వేదముల వలన దేవుడు తెలియబడడను మాట స్పష్టముగా ఉన్నది. ఆదిలో యోగశాస్త్రమును సూర్యునికి చెప్పినపుడు

విశ్వరూపము చూపలేదు. అటువంటి అవసరము ఆనాడు లేదు కనుక చూపలేదు. అట్లే ఆ రోజు వేదముల గూర్చి చెప్పలేదు. అటువంటి అవసరము ఆనాడు లేదు కనుక చెప్పలేదు.

ఇప్పటికి 5260 సంవత్సరముల పూర్వము ద్వాపరయుగములో భగవంతుని ద్వార రెండవ మారు యోగశాస్త్రము చెప్పబడినపుడు దానికి **"గీత"** అనిపేరు పెట్టబడినది. ఆదిలో చెప్పబడినపుడు **'గీత'** అనుపేరు లేదు. అలా **'గీత'** అని పేరు పెట్టుటకు కారణమేమనగా! మొదట యోగశాస్త్రమను పేరుతో చెప్పిన జ్ఞానమును విడచి, తనఇష్టమొచ్చినట్లు మానవుడు జ్ఞానమను పేరుతో వేదములను ఇతర పురాణములను ఆశ్రయించి దారి తప్పిపోతున్నాడని, అట్లు పోకుండుటకు ఇది నీకు హద్దు అని ఒక అర్థము నిచ్చునట్లు గీత అని పేరు పెట్టారు. మానవుడు దేవుని విషయములో తన ఇష్టమొచ్చినట్లు నడుచుకోకుండుటకు, ప్రక్కదారులైన మాయ మార్గములో పోకుండుటకు, ఒక హద్దు ఏర్పరచి, ఈ హద్దులో నడచుకొన్నపుడే నీవు గమ్యము చేరగలవని చెప్పాడు. అలా ఏర్పరచబడిన హద్దునే గీత అంటున్నాము. గీయబడినదే హద్దు కావున మానవుని చుట్టూ గీయబడిన హద్దులో ఉన్నపుడు మానవుని జీవితమునకు అర్థము పరమార్థ ముంటుందని, దేవుడు చెప్పిన హద్దేమిటో, మన చుట్టూ ఏర్పరచబడిన గీత ఏమిటో, ఆ గీతలో నడుచుకోవాలంటే, ఆ హద్దు మీరకుండా ఉండాలంటే, మనమెలా ఉండాలో తెలియకపోతే జీవితమునకు ఒక నిర్దేశత ఉండదని కూడా అందులోనే తెలుపబడినది. వేదములను వృక్షములు, పురాణములను తీగలు, యజ్ఞయాగాదులను జంతువులు, జపతపములను ఎత్తు పల్లములు గల జీవితమను అరణ్యములో జలాశయముల వైపు జంతువులు నడచిన పిల్లదారులను వ్రత నియమములను చూచి, ఇవియే

దారులని భ్రమించు మానవునికి రాజమార్గమై కనిపించి, జన్మయను అరణ్యమునుండి బయటపడునట్లు చేయు చక్కని మార్గమే గీత. దేశపటములో హైవే రోడ్డును గీతవలె చూపినట్లు జీవిత పటములో రాజమార్గమువలె గీచి చూపిన జ్ఞానమే గీత. భగవంతుడు గీచి చూపినది కావున భగవద్గీతయైనది.



# మీరు ఆస్తికులా - నాస్తికులా

పూర్వము ఆదిలోనే దైవజ్ఞానమును మానవులకు తెలిపినప్పటికీ కాలము గడచుకొలది, మానవులు ఉచ్ఛనీచములను ఆలోచించక, తమ హద్దును తెలుసుకోలేక, హద్దుమీరి నాస్తికులైపోతున్నారని తలచిన దేవుడు, మానవులకు ప్రత్యేకించి హద్దు (గీత) అను పేరుతో చెప్పినదే భగవద్గీత. గీతను చెప్పినప్పటికీ, నేడు గల ఆస్తికులు దేవుడు చెప్పిన ప్రకారము నడువగల్గుచున్నారా? దేవుడు చెప్పిన గీతను వదలి, మాయ చెప్పిన వేదములు మొదలుకొని అనేకముగయున్న బోధలలో ఆసక్తి కల్గి వాటి వెంటపోవు చున్నారు. కొందరు వైష్ణవమని, కొందరు శైవమని, కొందరు కుమారి సాంప్రదాయమని, కొందరు అచల సాంప్రదాయమని, కొందరు సిద్ధ యోగమని, కొందరు గురుసాంప్రదాయమని బోధకులందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క సాంప్రదాయమును బోధిస్తూ గీత యొక్క ఉద్దేశమును ఏమాత్రము ఆచరించడము లేదు. భగవద్గీత అంటే ఏమిటో తెలియని సమాజము నేడు హిందూమతములో గలదు. కొందరు స్వాములు చూపాకారమునకు భగవద్గీతలోని శ్లోకములు చెప్పినప్పటికీ ప్రజలకు బోధించునదంతా గీతకు వ్యతిరేఖ భావములే. కొందరైతే వేదములను ప్రమాణముగా తీసుకోవలెను

గానీ, గీతను ప్రమాణముగా తీసుకోకూడదంటున్నారు. దేవుడే స్వయముగ గీతలో ఒక్క దేవున్ని గురించి చెప్పితే స్వాములందరూ ఎందరో దేవుళ్ళను గురించి చెప్పుచున్నారు. అన్య దేవతారాధన తగదని, అట్లు చేయుట వలన మోక్షములభించదని, గీతలో రాజవిద్య రాజగుహ్యా యోగమున 23వ శ్లోకములో భగవంతుడే స్వయముగా చెప్పితే, ఆ మాటను ప్రజలకు బోధించవలసిన స్వాములే స్వయముగా అన్యదేవతలకు పూజలు చేయు చున్నారు. గీతలో అవసర మొచ్చినపుడు ధర్మములను పునరుద్ధరించుటకు అప్పుడప్పుడు భూమి మీద భగవంతునిగా పుట్టెదనని చెప్పగా, ఇంతకు ముందు ధర్మమును ఏమాత్రము చెప్పని రామునిగా పుట్టాడని ప్రచారము చేయుట ఆస్తికులకు తగునా? తన జన్మ చాలా రహస్యమైనదనీ ఎవరికీ అర్థము కాదని గీతలో దేవుడే చెప్పగా కృష్ణుని ప్రవర్తన బాగాలేదని, రాముడు సత్‌ప్రవర్తనుడని స్వాములందరూ కృష్ణునికంటే ముఖ్యముగా రామున్ని కొలువడము ఆస్తికులకు తగునా? దైవత్వమంటే ఏమిటో గీతలో సంపూర్ణముగా చెప్పియుండగా అందులోని విషయము అర్థముకాక వ్రతములు చేయువారు ఆస్తికులా? శరీరములో రెండు యజ్ఞములు జరుగుచున్నవని చెప్పగా బయటి యజ్ఞములు చేయువారు జ్ఞానముగల ఆస్తికులా? యజ్ఞమంటే కాల్చడమని, లేక నాశనము చేయడమని అర్థమగులాగున ద్రవ్యములను లేకుండా చేయడమును ద్రవ్యయజ్ఞమని, జ్ఞానములను లేకుండా చేయడము జ్ఞానయజ్ఞమని గీతలో చెప్పగా, కొందరు స్వాములు తమ ఉపన్యాస కార్యములను గీతాయజ్ఞములని పేర్లు పెట్టడము, ఇన్నిమార్లు చేశామని తెలుపుటకు 64వ గీతాయజ్ఞమని, 100వ గీతా యజ్ఞమని ప్రకటనలు వ్రాసి ప్రచారము చేయుట తగునా? భగవద్గీతలోని అర్థము ప్రకారము ఇన్ని మార్లు గీతను కాల్చి లేకుండా చేశామన్నట్లు

కాదా! గీతను తమకొరకు దేవుడు ఏర్పరచిన హద్దని, ఏ స్వాములైనా గ్రహించి బోధిస్తున్నారా? గీతలో సమస్తము తెలిసినామని మేము సర్వజ్ఞులమని చెప్పుకొనువారు ఇతర దేవతలకు ఈ విధముగా పూజలు చేయవలెనని చెప్పవచ్చునా? అన్యదేవతల ఆరాధన దారిదప్పిన మార్గమని గీత స్పష్టముగా బోధిస్తుండగా అన్య దేవతారాధనలకు ఫలానా ఫలానా పద్ధతులు గలవని, వాటి ప్రకారమే పూజలు చేయవలెనను వారు నిజముగా ఆస్తికులా? వెంకటేశ్వరుని పూజా విధానము వైఖానసము ప్రకారమనీ, పద్మావతికి పంచరాత్ర ప్రకారమనీ, ఆగమ పూజా విధానములు కల్పించినవారు ఆస్తికులా? నన్నొక్కడినే విశ్వసించమని గీతలో చెప్పగా, నీవేనా దేవుడివన్నట్లు అనేక దేవతలను కల్పించి, వారికి పూజా విధానములు కూడా కల్పించుట ఆస్తికులకు తగిన పనేనా? గీతలో తమ తలవ్రాతను మార్చుకొను విధానము శరీరములో గలదని సూచించియుండగా, బయట నదులలో మునిగి పాపము పోతుందనుకోవడము గీతకు వ్యతిరేఖము కాదా! దైవజ్ఞానములో మంత్రముల ప్రసక్తే లేకుండా గీతను చెప్పగా, ఉపదేశమని గురువులు శిష్యులకు మంత్రములను చెప్పుట గీతకు వ్యతిరేఖము కదా! ఎవరికీ తెలియనివాడనని గీతలో దేవుడు చెప్పగా, అదే గీతను బోధించు స్వాములు జీవుడే దేవుడని చెప్పుకోవడము పొరపాటు కాదా! గీతలో క్షర, అక్షర, పురుషోత్తములని ముగ్గురు పురుషులుగ చెప్పుకొన్న శ్లోకములు పురుషోత్తమప్రాప్తి యోగములో ఉండగా, ముగ్గురు పురుషులెవరో వివరించలేని స్వాములు ఆస్తికులా? పురుషులెవరో? ప్రకృతేదో గుర్తించలేక ప్రకృతిని పట్టుకొని పురుషుడని భ్రమించువారు నాస్తికులు కాక ఆస్తికులగుదురా! లోపల ఆత్మ జ్ఞానము తెలియక బయటగల చెట్టుకు, పుట్టకు మ్రొక్కువారు నాస్తికులు కాక ఆస్తికులగుదురా! ఇలా ప్రశ్నిస్తూ

పోతే సూత్రము ప్రకారము నేడు పెద్ద స్వాములు మొదలుకొని చిన్న పూజారి వరకు అందరూ దైవధనమను ఆస్తిలేని నాస్తివరులే. దేవుడు, దేవుని భక్తి తమకు లేదని బయటికి చెప్పుకొనువారు కనిపించు నాస్తికులు కాగా, లేకున్నా ఉన్నదని భ్రమిస్తూ ఇతరులను భ్రమింపచేయువారు ఆస్తికముసుగు లేసుకొన్న నాస్తికులని, వీరిపట్ల జాగ్రత్తగా ఉండవలెననీ, లేకపోతే వారిని అనుసరించు మిగతవారు కూడా జీవితమును నాస్తికత్వములో గడుపవలసి వస్తుందని చెప్పుచున్నాము. ఉదాహరణగ ఒక విషయాన్ని చూస్తాము.

పాతిక సంవత్సరముల పూర్వము ఒక ఆశ్రమములో ఒక స్వామీజీ జయంతి ఉత్సవ సందర్భముగా చాలామంది గొప్పగొప్ప స్వాములు పాల్గొన్నారు. అక్కడికి వచ్చిన స్వాములందరూ సన్న్యాసులే. వారిలో ఒక స్వామిజీ ఉపన్యాసము చెప్పుచూ సన్న్యాసత్వము చాలా గొప్ప మార్గమని ఇలా చెప్పసాగెను. **"సంసార జీవితములో ఉన్నవారెవరూ కూడా జ్ఞానము తెలుసుకోలేరు. జ్ఞానార్జన కొరకు ఆదిశంకరాచార్యుడు చిన్న వయస్సులోనే సన్న్యాసత్వము స్వీకరించి కాషాయ వస్త్రములు ధరించాడు. అలాగే వివేకానందుడు వివాహము చేసుకోకుండ సన్యాసత్వము పొందాడు. మేము కూడా సంసారమును త్యజించి సన్న్యాసత్వము స్వీకరించాము. సన్న్యాస జీవితములో ఏ ఆటంకము లేకుండా దైవజ్ఞానము తెలుసుకోవచ్చును ఆచరించవచ్చును. సంసార జీవితములో దేవుని జ్ఞానము తెలుసుకొనుటకు వీలుపడదు. ఒకవేళ తెలుసుకొన్నప్పటికీ ఆచరించుటకు ఏమాత్రము సాధ్యము కాదు. అందువలననే గొప్పవారందరూ సన్న్యాసత్వమును స్వీకరించారు. సంసారులు జ్ఞానము తెలియలేరు, సన్న్యాసులు మాత్రమే జ్ఞానమును తెలియగలరు. కావున పూర్వము పెద్దలు "సంసారి ఛీ, సన్న్యాసి**

**సై అన్నారు.”** అని ఈ విధముగా చెప్పిన స్వాముల మాటలకు ఒక యువకుడు ప్రేరేపింపబడినవాడై తాను కూడా పెళ్లి చేసుకోకుండా సన్న్యాసత్వము పుచ్చుకొని స్వామీజీవలె మారిపోయాడు. ఆ యువకుడు స్వాముల మాటలువిని, కాషాయ వస్త్రములు ధరించితేనే సన్న్యాసులౌతామను కొన్నాడు.

ఈ విషయములో స్వాములు చెప్పిన మాటలను ధర్మమా, అధర్మమా అని చూస్తే, భగవద్గీతలో ఆత్మసంయమ యోగమను అధ్యాయములో మొదటి శ్లోకములోనే భగవంతుడు ఈ విధముగ **“జ్ఞానాగ్ని లేనివాడు (జ్ఞానధనము లేనివాడు), చేయవలసిన పనులు మానుకొన్న వాడు నిజమైన సన్న్యాసి కాడు. కర్మఫలములైన పాపపుణ్యముల మీద ఆశ లేకుండ కార్యములు చేయువానిని నిజమైన సన్న్యాసి నిజమైన యోగి అనవచ్చును”** అని చెప్పాడు. దీనినిబట్టి కాషాయవస్త్రములకు, సన్న్యాసత్వమునకు సంబంధము లేదని తెలియుచున్నది. దేవుడు చెప్పిన మాటకు వ్యతిరిక్త దిశలో నడుస్తూ, వివాహము చేసుకొన్న వారివలె పనులు చేయక, మౌనదీక్షలో ఉన్నామని మాట్లాడని వారుకొందరు, యోగదీక్షలో ఉన్నామని బయటికి కనిపించని కొందరు గలరు. కాషాయమంటే సన్న్యాసత్వమను అర్థమొచ్చునట్లుండుట ధర్మము కాదు, అధర్మమేనని తెలియుచున్నది. ఎందరో స్వామీజీలు భగవద్గీతలోని దైవజ్ఞానమును గ్రహించుకోక తాము చెడిపోయి ఇతరులను చెడుపుచున్నారు. నేడు హిందువులలో 85 శాతము భగవద్గీత అంటే ఏమిటో తెలియనివారు గలరు. కేవలము 15 శాతములో భగవద్గీతను చూచిన వారు కొందరుండగా, కొందరు గీతను చదివినవారు గలరు. చదివిన వారిలో స్వాములు కొందరుండగ వారికే గీత అర్థము కాలేదని తెలియుచున్నది. గీత ఆధ్యాత్మిక ప్రమాణ గ్రంథమని చాలామందికి

తెలియక ఎందరో స్వామీజీలు పురాణములను, ఇతిహాసములను తమ బోధలలో ఎక్కువగా చెప్పుకొనుచున్నారు. పురాణ ఇతిహాసములు కాలక్షేపమునకేగాని కర్మక్షేపమునకు పనికిరావని తెలియకున్నారు. జ్ఞానాగ్ని కర్మయను కట్టెలను కాల్చునది. జ్ఞానాగ్ని గీత జ్ఞానము వలననే లభించును. జ్ఞానాగ్ని అనబడు జ్ఞానధనమున్నవాడే ఆస్తికుడు. గీతను అనుసరించక, దాని హద్దులో లేకుండా, తన ఇష్టమొచ్చునట్లు నడుచుకొనువాడు జ్ఞాన ధనము లేని నాస్తికుడని చెప్పవచ్చును. మొత్తము మీద ఆస్తికత్వమును గూర్చి తెలియనివాడు ఆస్తికుడెలా అగును? అందువలన మొదట ఆస్తికత్వమంటే ఏమిటో నేడు ఆస్తికులమనుకొనువారు తెలియవలసిన అవసరమున్నది.

మరికొందరు సంస్కృత భాషను నేర్చినంత మాత్రముననే స్వాములై పోయి ఆస్తికులమనుకొనుచున్నారు. సంస్కృత భాష తెలిస్తేనే జ్ఞానము తెలియునను ఉద్దేశముతో కొందరు గలరు. సంస్కృత భాషాపాండిత్యమునే జ్ఞానమనుకొనువారు గలరు. భావమును తెలుపునది భాష. ఏ భాష అయినప్పటికీ అందులో తెలియవలసిన సమాచారము మాత్రమే ఉండును. ఏ భాష ద్వారా అయినా జ్ఞానమును తెలియవచ్చును. ఒక్క సంస్కృత భాష ద్వారానే జ్ఞానము తెలియుననుకోవడము పొరపాటు. దీనిని బట్టి సంస్కృతము తెలిసినవారు ఆస్తికులమనుకోవడము కూడా పొరపాటు. నేడు బహు భాషాకోవిదుడు కూడా నాస్తికుడుగ ఉండడము, చదువు రానివాడు సంపూర్ణజ్ఞానియై ఆస్తికుడుగ ఉండడము గలదు. జ్ఞానధనము లేనివాడు గొప్ప కులములో పుట్టి సంస్కృత పాండిత్యమున్నప్పటికీ నాస్తికుడే, జ్ఞాన ధనము గలవాడు నీచకులములో పుట్టి సంస్కృత పాండిత్యము లేనప్పటికీ ఆస్తికుడే అగును.

కొందరాస్తికులు సంస్కృత శ్లోకములను కంఠస్థము చేసుకొని, అనుష్టానమను పేరుతో నియమములను ఆచరించుచూ, నేర్చుకొన్న శ్లోకములను వల్లిస్తుందురు. ప్రజలకు వారి అనుష్టానము వలనగానీ, వారి వేదపఠనము వలనగానీ, ఏమాత్రము జ్ఞానము లభించదు. కొందరికేమో తాము నేర్చుకొన్న శ్లోకములకు అర్థము తెలియదు. తూర్పుకు తిరిగి మంత్రము చెప్పువారికి తూర్పుకెందుకు తిరగాలో తెలియదు. ముక్కు పట్టుకొని మంత్రశ్లోకము చదువుచున్న వారికి ముక్కు ఎందుకు పట్టుకోవాలో తెలియదు. మంత్రము చెప్పునపుడు ముక్కును గట్టిగా పట్టుకొని శ్వాస ఆడకుండునట్లు చేసి మంత్రము పఠించవలెనని నియమముండగా, ఆ విషయము తెలియనందువలన కనిపించునట్లు ముక్కు మీద వ్రేళ్లు పెట్టుకొని శ్వాస యథాతథముగ ఆడుచుండగా మంత్రము చెప్పువారు కూడా గలరు. ఇలా మేము నిష్ఠాగరిష్ఠులైన ఆస్తికులమనుకొనువారు కూడా తమ నిష్టను గురించి తమకే తెలియకున్ననూ, ఇతరులను అవహేళనగా మాట్లాడడము జరుగుచున్నది. ఆస్తికత్వము యొక్క సూత్రము తెలియని కొందరు వైదిక అనుష్ఠాన పండితులు ఇతరులను ఎలా హేళనగ మాట్లాడుచున్నారో ఉదాహరణగ ఒక పుస్తకములో వ్రాయబడిన విషయమును క్రింద పేరాలో చూస్తాము.

**"సరియైన మార్గము దొరకక, సదాచార్యుడు లభించక సత్సాంగత్యము లేక, శాస్త్రీయ పరిచయము లేక, కుమత ప్రవిష్ణులై ప్రాకులాడుచు మరియొక తెగవారున్నారు. 1) చూడచక్కని చిన్నది కడ మేడగదిలోనున్నది. ఏడు రంగుల మడుగులో జలక్రీడలాడుచున్నది. 2) రెక్క ముక్కులేని పక్షి రేయింబగలు తపసుపట్టి ఒక్క చెరువు చేపలన్ని ఒకటే మ్రింగెరా. 3) పోగా పోగా గోడుంది, గోడకు తగ్గ గూడుంది,**

**గూడుకు తగ్గ ప్రమిదుంది. 4) చెప్పులోని రాయి చెవిలోని జోరీగ కంటిలోని నలుసు కాలిముల్లు ఇంటిలోని పోరు ఇంతింతగాదయా విశ్వదాభిరామ వినురవేమ. 5) పన్నెండు గొమ్మల పటామఱ్ఱి, దానిపై పంచవన్నెల రామచిలుక, దానిమీద నక్కవలె ప్రకాశించు చుక్క, దానిలోనే రహస్యముండు. 6) గుంటూరి కవతాలనున్న చింతలకాడ గుజ్జపు కడుపున గొఱ్ఱె పుట్టెనయా నందామయా గురుడ నందామయా ఆనందదేవికి నందమయా. ఇవి వీరి ఉపనిషత్సూక్తులు తత్త్వావాచకములు. వీటికేమో అంతరార్థమట వీరి శ్రాద్ధమట"**

పై విషయము చూస్తే వ్రాసిన గ్రంథకర్త ఎదుటివారి యొక్క విలువను, వారు చెప్పిన విధానమును గ్రహించక కేవలము అనుమానముతో అవమానముగ మాట్లాడిన మాటలని తెలియుచున్నది. శరీరము దేవాలయము, శరీరములోని ఆత్మే దేవుడు అని శాస్త్రము చెప్పియుండగా, అది తెలియక బయటగల వైదికనిష్ఠను పట్టుకొని ప్రాకులాడు వారికి ఆత్మజ్ఞానము కల్గిన వారియొక్క వాక్యములు అర్థము కావు. కళ్ళెము వేసిన గుఱ్ఱమునకు కన్నులకు ప్రక్క చూపులేకుండా ముందుచూపు కనిపించునట్లు కళ్ళచిప్పలు కట్టబడి యుండును. కళ్ళచిప్పలు గల గుఱ్ఱము ఎదురుగనున్న దారితప్ప ప్రక్క చూపులేకుండుట వలన ప్రక్క దృశ్యములను చూడలేదు. అలాగే వైదికనిష్ఠలనబడు కళ్ళగంతలుండుట వలన అనుష్ఠానములు తప్ప మిగతా ఆత్మజ్ఞానులను గ్రహించలేని స్థితి కొందరికుండును. అటువంటి వారు వ్రాసినవే పై వ్యాఖ్యలు. శరీరాంతర్గత వివరమును అందులోని దైవమును పోల్చి వ్రాసిన విశేష జ్ఞానమును గ్రహించక హేళనగా మాట్లాడిన గ్రంథకర్త గొప్పపేరున్న వేదవేత్త అయినప్పటికీ ఆస్తికుడు కాదని జ్ఞానధనము లేని నాస్తికుడని చెప్పవచ్చును.

కొందరు కాశీకి పోయి సంస్కృత విద్యను నేర్చి వేదపారాయణము చేసి భాషా పాండిత్యము గల స్వాములుగా తయారగుచున్నారు. వేదములు చదివినవాడే స్వామి, గురువను ఉద్దేశము వారిలో ఉండుట వలన వేదపాండిత్యము లేనివారిని తక్కువగా చూస్తుందురు. వారిమాటలందే వేదములు గొప్పవని చెప్పుచు వేదములు అపౌరుషేయములు అంటున్నారు. వేదములు మనుషులు వ్రాసినవి కావు, దేవుడే వాటిని సృష్ఠించాడని వారి వాదనలోని అర్థము. వేదములు అపౌరుషములు అనడములో వేదములు పురుషుడైన దేవున్ని గురించి చెప్పలేదు, స్త్రీ అయిన ప్రకృతిని గురించి చెప్పినవని అర్థమెందుకు తీసుకోకూడదని మా వాదన. అలాగే వేదములు పురుషుడైన పరమాత్మ చెప్పలేదు. స్త్రీతత్త్వమైన ప్రకృతినుండి చెప్పబడినవని ఎందుకు అర్థము చేసుకోకూడదని అడుగుచున్నాము. బ్రహ్మవిద్యకు ప్రమాణమైన భగవద్గీత శాస్త్రములో గుణత్రయ విభాగ యోగమునందు 5వ శ్లోకమున **"సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతి సంభవాః"** సత్త్వ గుణము, రజో గుణము, తమోగుణము అను మూడు గుణములు ప్రకృతికి పుట్టినవి. **"త్రైగుణ్య విషయా వేదా నిస్త్రై గుణ్యో"** వేదములలో మూడుగుణముల విషయములే గలవు, వాటిని విడువుము అని గలదు. గుణములు ప్రకృతి సంభవములు అవియే వేదములని దేవుడే చెప్పగా, దేవుని జ్ఞానమును వదలి వేదములను గొప్పగా చెప్పుకొనువారు ఆస్తికు లగుదురా? ప్రకృతిని కూడ నేనే పుట్టించాను. అది గుణరూపమైన మాయగ నున్నదని కూడా గీతలోనే చెప్పబడినది. ఇన్ని విధముల చెప్పినప్పటికీ బ్రహ్మవిద్యకే ప్రమాణమైన దేవుని గీతను వదలి మాయకు ప్రతిరూపములైన గుణమయమైన వేదములనాశ్రయించు వారు ఆస్తికులగుదురా? ఇలా వివరిస్తూ పోతే నేడు ఆస్తికులనబడువారిలో నాస్తికత్వము తప్ప ఆస్తికత్వము కనిపించడము లేదు. ఇక హేతువాదులను వివరించుకొందాము.



# మీరు హేతువాదులా? అహేతువాదులా?

ఒక విషయమును గూర్చికానీ, ఒక పదార్థమును గురించికానీ సంపూర్ణముగ తెలిసినపుడు ఆ విషయమును వివరించి చెప్పుటకు వీలగును. వాటిలోని లాభనష్టములను, తప్పొప్పులను విశధీకరించి చెప్పుటకు వీలగును. ఉదాహరణకు ఒకడు నాలుగు రకముల మొక్కలను చూపించి, ఇది ఫలానా మొక్క అని పేరు చెప్పి, ఈ మొక్క ఆకులు ఫలానా రోగమును నయము చేయుటకు ఉపయోగపడునని తెలిపాడనుకొందాము. అపుడు అది సత్యమా, అసత్యమా అని తేల్చి చెప్పుటకు ఆ మొక్కల విషయము తెలిసి ఉండాలి. మొక్కల పేరును మునుపెన్నడూ విననివాడు, మొక్కల ఆకారమును ముందెపుడూ చూడనివాడు, ఇవి ఫలానా మొక్కలు కాదని చెప్పుటకు వీలులేదు మరియు ఫలానా మొక్కలేనని చెప్పుటకు కూడా వీలులేదు. అలాగే వాటియొక్క పనితనమును గురించి కూడా చెప్పలేడు. విషయము యొక్క అవగాహన లేనపుడు దానిని గురించి మాట్లాడే హక్కు లేదనియే చెప్పవచ్చును. విషయజ్ఞానము తెలిసినవాడే ఆ విషయమును గురించి మాట్లాడాలి. తెలియనివాడు విషయజ్ఞానమును గురించి తెలుసుకోవాలి.

కొందరు కొన్ని విషయములను సంపూర్ణముగా తెలిసియుండి మిగతా విషయములను తెలియకుండిన తెలిసినట్లే మాట్లాడుచుందురు. ఉదాహరణకు రాయిని గురించి తెలిసినవాడు రత్నములను గురించి తెలియకున్ననూ దానిని గురించి మాట్లాడడము అవివేకము కాదా! అట్లే ప్రపంచ చదువులు సంపూర్ణముగ చదివినవారు, పరమాత్మ చదువును గురించి మాట్లాడుట సరియైన పనేనా? యం, ఎ. ఫిలాసఫి (M.A.Ph.D) చదివినంత మాత్రమున దేవుని జ్ఞానమును గురించి మాట్లాడుటకు

తగుదుమా? ఈ విధముగ యోచిస్తే ఒక విషయమును గురించి సంపూర్ణముగ తెలిసినపుడే దానిని గురించి సహేతుకముగ మాట్లాడ వచ్చునన్నది సూత్రము. తెలియకుండా మాట్లాడినపుడు ఆ విషయము హేతుబద్ధముగా ఉండదు. దేనినైనా అవగాహన లేకుండా మాట్లాడినపుడు అది అనుమానమే తప్ప ప్రమాణము కాదని చెప్పవచ్చును. దేనినైనా ప్రమాణము లేకుండా అనుమానముతో మాట్లాడడము దానిని అవ మానించినట్లే అగును.

హేతువు అనగ కారణము. హేతువాదము అనగ వాస్తవ కారణమును గూర్చి అడగడము, అనగా ఒక విషయములోని కారణమును అడగడమని అర్థము. కారణమునకు ఉన్న వివరమును చెప్పడమే ప్రశ్నకు తగ్గ జవాబనవచ్చును. ఏ ప్రశ్ననైనా శాస్త్రమునను సరించి అడిగినపుడు సహేతుకమవును. అట్లే జవాబు కూడా శాస్త్రసమ్మతముగ ఉన్నపుడే హేతుబద్ధమగును. అందువలన ప్రశ్నించునపుడు కానీ, జవాబు చెప్పునపుడు కానీ, శాస్త్రబద్ధత ఉందోలేదో చూచుకోవలసి ఉన్నది. శాస్త్రమంటే ఏమిటని కొందరికి ప్రశ్నరావచ్చును. **శాపము అన్నపదము నుండి శాస్త్రము అనుపదము, శాసనము అన్నపదములు పుట్టినవి.** చెప్పినట్లు జరిగితీరునది శాసనము లేక శాస్త్రము లేక శాపము అనవచ్చును. దీనినే విజ్ఞానము అనవచ్చును. ఉదాహరణకు బెంగుళూరు నుండి హైదరాబాద్‌కు 565 కిలోమీటర్ల దూరము గలదని ఒక బోర్డు మీద వ్రాయబడి ఉన్నది. దానిని చదివి ఇంతదూరమున్నదని తెలియడము జ్ఞానమగును. 565 కిలోమీటర్లు ప్రయాణము చేసి హైదరాబాద్‌ను చేరి బోర్డుమీద చెప్పబడిన హైదరాబాద్‌ను చూడడమును లేక అనుభవపూర్వకముగ తెలుసుకోవడమును విజ్ఞానము అంటాము. జ్ఞానమును వివరమని, అనుభవమును విజ్ఞానమని

చెప్పవచ్చును. బెంగుళూరు నుండి హైదరాబాద్ ఎంత దూరమున్నదని ప్రశ్నించడము ఒక ప్రశ్న. దానికి బదులుగ 565 కిలోమీటర్లు దూరమున్నదని వాస్తవమును చెప్పడము ఒక జవాబు. ప్రశ్నకు ఆ జవాబు సరియైనదో కాదో ఒకమారు ఆ దూరమును అనుభవరీత్యా ప్రయాణించినవాడు మాత్రమే తేల్చి చెప్పగలడు. దానినే విజ్ఞానము అంటాము. విజ్ఞానమున్న వానికి ప్రశ్న మరియు జవాబు సరియైనదో కాదో తెలియును. విజ్ఞానము అన్నదానిని వివరించుకొంటే ఈ విధముగనున్నది.

విజ్ఞానమును విభజించుకొని చూస్తే అందరికీ తెలియునట్లు ఐదు రకములుగ ఉన్నది. అందరికీ తెలియకుండునట్లు ఒక రకము కూడా ఉన్నది. మొత్తము మీద విజ్ఞానములు ఆరు రకములని చెప్పవచ్చును. అందరికీ తెలియబడునట్లు, అందరూ ఒప్పుకొనునట్లుండిన ఐదు విజ్ఞానములను కలిపి ఇంగ్లీషులో ఒక పేరు పెట్టారు, అదియే సైన్సు. ఆంగ్లభాషలో సైన్సు అనినా తెలుగు భాషలో విజ్ఞానమనినా రెండూ ఒక్కటే. ప్రయోగము ద్వారా నిరూపింపబడునది సైన్సు. అలాగే చేసినపుడు అనుభవానికి వచ్చునది సైన్సు. ఐదురకముల సైన్సు కంటే వేరుగ ఆరవ రకము సైన్సు గలదు. దానినే సైన్సులలోకెల్ల సైన్సు అని అంటాము.

ఆరవ సైన్సునే యోగశాస్త్రము లేక బ్రహ్మవిద్యాశాస్త్రము అంటాము. ఇంగ్లీషు భాషలో ఫిలాసఫి అని కూడా అందురు. 'ఫిలాసఫి' అంటే 'ఆల్ సైన్స్ ఆఫ్ సైన్స్' అని కూడా అందురు. ఇప్పటి కాలములో ఐదు విజ్ఞానము లలో ఏదో ఒక దానియందు, ఒక యదార్థ విషయములను విజ్ఞానబద్ధముగ కనుగొని నిరూపించగలిగినపుడు, కనుగొన్నవానికి డాక్టర్ ఆఫ్ ఫిలాసఫి (Ph.D) అని సర్టిఫికేట్ ఇస్తున్నారు. అంతటితో అతను మేధావులలోనికి

చేరిపోయానని అనుకొనుచున్నాడు. కానీ కనుగొన్నది ఒక శాస్త్రములోని ఒక భాగమే అని తెలియక శాస్త్రములన్నీ తెలిసినట్లు పట్టాపొందుచున్నారు. ఏ శాస్త్రములో ప్రావీణ్యతయుండి ఆ శాస్త్రములో క్రొత్త విషయమును కనుగొనియుంటే, డాక్టర్ ఆఫ్ అని చివర ఆ శాస్త్రము పేరు పెట్టాలి. కానీ ఏకముగ డాక్టర్ ఆఫ్ ఫిలాసఫి అని పెట్టడము లేనిదానిని పెట్టుకొన్నట్లుగు నని మా అభిప్రాయము. ఫిలాసఫి అనునది ప్రత్యేకమైనది. కనుగొన్న విషయమునకు దానికి సంబంధము లేదు. అయినప్పటికీ మేథావులు ఎందుకు ఆ పేరు పెట్టుకొన్నారో తెలియదు. ఒక విధముగ ప్రకృతికి సంబంధించిన ఐదుశాస్త్రములలో దేనిని పరిశోధించి ఒక క్రొత్త సిద్ధాంతమును కనుగొన్నప్పటికీ, పేరు చివర పిహెచ్.డి (Ph.D) అని పెట్టుకోవడము అసమంజసమేనని చెప్పవచ్చును. ఒక్క యోగశాస్త్రము తెలిసినవారు, అందులోని క్రొత్త సిద్ధాంతములను కనుగొని వివరించ గలిగినపుడు వారిని మాత్రము డాక్టర్ ఆఫ్ ఫిలాసఫి అనవచ్చును.

గుంపులో గోవింద అన్నట్లు, నలుగురితో పాటు నారాయణ అన్నట్లు పేరు చివరలో (Ph.D) పెట్టుకొనినా ఫరవాలేదు. కానీ అన్ని శాస్త్రములు తెలుసునని ఇతర శాస్త్రములలోని విషయములను విమర్శించడము పొరపాటు. శాస్త్రములకెల్ల శాస్త్రమైన, విజ్ఞానముల యొక్క విజ్ఞానమైన బ్రహ్మవిద్యాశాస్త్రము (యోగశాస్త్రము) ను గురించి విమర్శించి మాట్లాడడము మరీ పొరపాటు. ఒక దానిని గూర్చి సంపూర్ణముగ తెలిసినపుడే దానిని గురించి ప్రశ్నించే హక్కు కలిగియుందుము. తెలియకున్ననూ ప్రశ్నించినపుడు 'దూడ మూరడు దంటు బారడు' కదా అన్నట్లు చొప్పదంటు ప్రశ్న అగును. నేటికాలములో మేథావులమనుకొన్న వారు చాలామంది హేతువాదులమను కొని తమకు తెలియని యోగశాస్త్రమును గూర్చి ప్రశ్నించుచున్నారు. వారి

వాదనలో ముఖ్యసూత్రము, నమ్మకమనునది సైన్సుకాదని, యదార్థముగ కనిపించునదే సైన్సని, సైన్సు ప్రకారమున్న వాటినే ఒప్పుకుంటామని, నమ్మకమును ఒప్పుకోమని అంటున్నారు.

కనిపించునవన్నీ సత్యము కాదని, కనిపించకుండా నమ్మకము మీద ఆధారపడినవి కూడా కొన్ని సత్యమని వారికి తెలియదు. ప్రత్యక్షముగ కనిపించువాటిలో కూడా కొన్ని అసత్యములు దాగియున్నవని, కొన్ని కనిపించని నమ్మకములలో కూడా సత్యములున్నవని చెప్పడమే నిజమైన హేతువాదమని హేతువాదులమనుకొను వారికి తెలియదు. కనిపించున వన్నీ సత్యము కాదు, నమ్మకములన్నీ అసత్యములు కాదనడము హేతు వాదములోని ముఖ్యసూత్రము కాగా, ఆ సూత్రమునకు విభిన్నముగ తమ మనసులో ఒక హద్దును ఏర్పరచుకొని, నమ్మకము అనుదానిని ఖండించడమే హేతుబద్ధతలేని హేతువాదుల పనియైనది.

కళ్ళకు కనిపించునవి అసత్యమెలా అగునని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి జవాబేమనగా! చంద్రుడు అందరికి ఒక అడుగు వెడల్పే కనిపిస్తున్నాడు. అయినప్పటికీ అది నిజముకాదు. ఎండాకాలమున కిలోమీటరు దూరములో నీరు సమగ్రముగ ఉండునట్లు కనిపించుచుండును. అలా అందరికి కనిపించినప్పటికీ అది నిజము కాదు. భూమి అంచునకు ఆకాశము అంటుకొన్నట్లు కనిపిస్తుండును అయినా అదియు నిజము కాదు. అలాగే వినేటివన్నీ నిజము కాదనుటకు ఉదాహరణగ నేతిబీరకాయలో నెయ్యి లేదు, పచ్చకర్పూరములో పచ్చదనము లేదు. ప్రత్యక్షముగ అందరికీ కనిపించు అందరికీ వినిపించు వాటిలో కూడా సత్యము లేదని తెలియు చున్నది. ఈ విధముగనే మనుషులకున్న నమ్మకములలో అన్నియు

సత్యముకాదు మరియు అన్నియు అసత్యమునుగాదు. కాకి గూటిలోనున్న పిల్లలన్నిటినీ కాకి పిల్లలనుకోవడము సహజమే అయినప్పటికీ ఆ పిల్లలలో కొన్ని కోకిల పిల్లలు కూడా ఉండవచ్చును. చిన్న తనములో అన్నీ ఒకే లాగుండిన కొంతకాలమునకు అవి మనమనుకొన్నట్లు అన్నీ కాకులే కాదని తెలియగలదు. అలాగే నేడు కొందరు హేతువాదులుగ కనిపిస్తున్నప్పటికీ అందరు నిజమైన హేతువాదులుకారు. వారిలో కొందరు హేతువులేని వాదులు కూడా గలరు. ఆ విధముగనే నమ్మకములలో అన్ని మూఢ నమ్మకములు గావు, వాటిలో కొన్ని గొప్ప సత్యములు కూడా ఉండును. కావున నమ్మకమును ఒప్పుకోము అను హేతువాదుల సూత్రము అసలు సిసలైన మాలాంటి హేతువాదులు ఒప్పుకోరు. నమ్మకమును ఒప్పుకోము అను సూత్రము కొట్టివేయబడుచున్నది. కొన్ని నమ్మకములను తప్పక ఒప్పుకోవలసి కూడా ఉన్నది. హేతువాదము శాస్రబద్ధమైనది కావున గ్రుడ్డిగ ఖండించువారిని హేతువాదులనకూడదు.

నాస్తికులు దేవుడే లేడంటున్నారు. హేతువాదులు కనిపించని దేవుడు నమ్మకముమీద ఆధారపడి ఉన్నాడని, సైన్సుప్రకారము నమ్మకమునకు చోటు లేదని, కావున దేవుడు ఆస్తికులు కల్పించుకొన్న భ్రమయేగాని నిజముగ లేడంటున్నారు. అంతేగాక ఆరవశాస్త్రమైన యోగశాస్త్రము అని పేరుగాంచిన భగవద్గీతను కల్పితము అంటున్నారు. ఆరోపించడము వరకే పరిమితమైన హేతువాదులమనుకొనువారు అసలు నిజమును ఏమాత్రము పరికించి చూడడము లేదు. దేవుడున్నాడను వారితో వాదనకు దిగము అంటున్నారు. వాదనలోనికి దిగితే చిక్కులో ఇరుక్కొన్నట్లని, వారిని ఒప్పించలేమని, తెలుసుకొన్న హేతువాదులు ఎక్కడ కూడా శాస్త్రబద్ధముగ దేవుడు లేడని నిరూపించక, తగిన కారణములను చూపక, ఆస్తికులకు

విరుద్ధముగ మాట్లాడడమే తమ పనిగా పెట్టుకొన్నారు. హేతువాదులు మాట్లాడునవన్నీ ప్రశ్నల రూపముగ విమర్శల రూపముగ ఉండునే కానీ ఏవీ జవాబు రూపముగగానీ, వివరణరూపముగ గానీ ఉండవు. వారి ప్రశ్నలు 1) ఎవరైనా దేవున్ని చూచియుంటే మాకు చూపండి ఒప్పు కుంటాము. 2) దేవుడుంటే మాకెందుకు కనిపించడు. 3) దేవుడు, దయ్యము అనునవి ఆస్తికులు కల్పించుకొన్న నమ్మకములు మాత్రమే నిరూపణకు రావు. 4) మ్రొక్కిన వారికి కోర్కెలు తీర్చుదేవుడు మ్రొక్కని వారిని ఏమి చేయుచున్నాడు. 5) మేము దేవున్ని ఒప్పుకోనపుడు మమ్ములను శిక్షించలేదే. 6) దేవుడున్నాడని చెప్పువారు ప్రజలను త్రప్పుదోవ పట్టించినట్లు కాదా! 7) వారి నమ్మకమును అందరి మీద దిద్దడమే బోధల రూపములో చెప్పడము. ఈ విధముగ ఎన్నో విమర్శలు చేయుచుందురు.

ఆరవ శాస్త్రమైన యోగశాస్త్రము ఏమిటో, దాని వాస్తవికత ఏమిటో, ఆస్తికులమనుకొనువారికే సరిగా తెలియని కాలములో హేతువాదులకు జవాబు చెప్పువారుండకపోవచ్చును. హేతువాదులకు దేవుని విషయము అర్థము కావాలంటే, ఫిలాసఫి అనునది ఏమిటో తెలియాలంటే స్థూల సూక్ష్మములనునవి తప్పనిసరిగ అర్థము కావాలి. ఉదాహరణకు కొంత వివరించుకొందాము. ఒక ఇంటిలో ఫ్యాన్లు తిరుగుచున్నవి, టీ.విలో బొమ్మ కనిపిస్తున్నది, మోటరు పనిచేయుచున్నది. ఇంటిలో పనిచేయు పరికరములన్నియూ అనేక రూపములలో, అనేక విధములగు పనులు చేయుట అందరికీ తెలిసిన విషయమే. అన్ని పరికరములు పనిచేయుటకు ముఖ్యముగ విద్యుత్‌శక్తి అవసరము. స్థూలముగ పరికరములు కనిపించు చున్నప్పటికి కనిపించక సూక్ష్మముగనున్న కరెంటు పని జరుగుటకు అవసరమని తెలియుచున్నది. ఎంతో బలమైన పరికరము మరియు పెద్దయిన

పరికరము కదలుటకు ఒక శక్తి అవసరమని అదియే విద్యుశ్ఛక్తి అని అందరికీ తెలిసిన విషయమే. పనిచేయుచున్న స్థూలముగనున్న యంత్రము కనిపిస్తున్నది, కానీ యంత్రమును కదలించు విద్యుత్తు ఎవరికీ కనిపించడము లేదు. కరెంటు తీగను మనము చూడవచ్చును గానీ, దానిలో ప్రయాణించు కరెంటును చూడలేము. కరెంటు సూక్ష్మమైనది కావున కనిపించదు. కనిపించనంత మాత్రమున కరెంటును ఎవరూ లేదనలేరు. కనిపించకుండి నప్పటికీ ఉన్నదని దానిని తప్పనిసరిగ నమ్మి తీరవలసిందే. ఇక్కడ కరెంటు వలన పనిజరుగుచున్నదనీ, అది ఉన్నట్లు నిరూపింపబడుచున్నదనీ, కావున కనిపించకుండిన దాని పనితనము తెలియుట వలన అది సైన్సుకు అందు విషయమని హేతువాదులు చెప్పవచ్చును. హేతువాదులు ఇక్కడ కనిపించని కరెంటును నమ్ముచున్నట్లే కదా!

భూమి మీద గల చిన్నవి పెద్దవి అయిన అనేక రక శరీరములు స్థూలముగ కనిపించుచున్నవి. ఆయా శరీరములలో కదలించు శక్తి కూడా ఉన్నది. శక్తి ఉన్నంతసేపు శరీరములు కదలుచుండును. కరెంటున్నంతసేపు తిరిగిన ఫ్యాన్ కరెంటు పోయిన వెంటనే ఆగిపోయినట్లు శరీరములో శక్తి ఉన్నంతసేపు కదలి తిరుగాడిన శరీరము, శక్తి పోయిన వెంటనే చైతన్యము లేనిదై పోవుచున్నది. ఫ్యానును తిప్పుశక్తికి మనమొక పేరుపెట్టుకొన్నాము అదియే విద్యుత్‌శక్తి. అలాగే శరీరమును కదిలించు శక్తికి కూడ ఒక పేరు పెట్టుకొన్నాము అదియే ఆత్మశక్తి. శక్తుల యొక్క పేరులో మార్పులు గలవు. కానీ రెండు చేయుపని కదలించడమే. కరెంటును గూర్చి తెలుసుకొనుటకు ఎంతో వివరము సేకరించి పెట్టుకొన్నాము. కరెంటు అంటే ఏమిటి? దాని ఓల్టేజ్ అంటే ఏమిటి? అది ప్రయాణము చేయుటకు ఏ లోహము అవసరము? ఏ విధమైన పరికరముల మీద పనిచేయును?

అది ఎలా ఆఫ్ ఆన్ అవుచున్నది? మొదట అది ఎలా పుట్టుచున్నది? అను ప్రశ్నలకంతటికీ జవాబు గలదు. ఇదంతయూ పరిశోధనల ద్వారా తెలుసుకుంటేనే తెలిసింది. కరెంటు (విద్యుత్తు) ప్రపంచము పుట్టినప్పటి నుండి ఉన్నప్పటికీ అది ఎవరికీ తెలియదు. ఎన్నో యుగములు గడచి పోయినప్పటికీ తెలియని కరెంటును గురించి ఈ మధ్య కొన్ని వందల సంవత్సరముల పూర్వము కనుగొన్నాము. కరెంటులో పాజిటివ్, నెగిటివ్ అని రెండున్నట్లు పూర్వము నుండి ధనధృవము, ఋణధృవమని రెండుగలవు. ఆకాశములో ధనధృవము, భూమిలో ఋణధృవములున్నవని, ఎండా కాలము వచ్చు తొలకరి వానలపుడు ధన ఋణ ధృవములు కలయికతోనే మెరుపులు, పెద్దశబ్దము కల్గిన ఉరుములు పుట్టుచున్నవని కూడా చెప్పుచున్నారు. పెద్దవెలుగు పెద్ద శబ్దము ప్రత్యక్షముగ కనిపించుట వలన, మరియు 'పిడుగు' అను పేరుతో షాక్ తగులుట వలన, మనుషులు జంతువులు చనిపోవడము కూడా జరుగుట వలన దానిని కరెంటనీ, దానినే ఆకాశ కరెంటనీ పూర్వము నుండి చెప్పడము జరుగుచున్నది. హింది భాషలో 'ఆస్మాని బిజిలి' అని కూడా అనుచున్నాము. ఇంత పెద్ద కరెంటు తయారగుటకు కారణము భూమికి గల అయస్కాంత శక్తియే మూలము. అయస్కాంతమునకు ఉత్తర దక్షణ ధృవములు రెండూ ఉండును. ప్రపంచము మొత్తము మీద అయస్కాంతశక్తి ఉత్తర, దక్షిణ ధృవములుగ ఉంటూ రాత్రిపూట పాలపుంత రూపముగ కనిపిస్తున్నది. ఈ ఉత్తర దక్షిణ ధృవముల వలననే కరెంటు ధన ఋణ (పాజిటివ్, నెగిటివ్) ధృవములుగ తయారవు చున్నది. కనిపించని అయస్కాంతశక్తి నుండి కనిపించని కరెంటు తయారవు చున్నది. ఈ సూత్రము మీదనే నేడు అయస్కాంతముల ద్వారా కరెంటు తయారు చేయుచున్నారు. ఇంతవరకు కరెంటు వివరము కొంత తెలుసు కొన్నాము. ఇపుడు కరెంటులాగే ఉన్న ఆత్మను తెలుసుకొందాము.

యంత్రమును కదలించునది విద్యుత్తు, శరీరమును కదలించునది ఆత్మ. విద్యుత్‌కున్న శక్తిని విద్యుత్‌శక్తి అంటున్నాము. ఆత్మకున్న శక్తిని ఆత్మశక్తి అంటున్నాము. విద్యుత్ కనిపించని అయస్కాంతశక్తి ద్వారా తయారైనది. ఆత్మ కనిపించని ఒక ఆది అంత్యము లేని శక్తి ద్వారా తయారైనది. అనంతశక్తి ద్వారా తయారైన శక్తి హేతువాదులము, నాస్తికవాదులమనుకొనువారిలో కూడా గలదు. హేతువాదుల శరీరములోని అన్ని భాగములకు అనంతశక్తి ద్వారా తయారైన ఆత్మశక్తియే ఉపయోగ పడుచున్నది. ఏ శక్తితో తాము కదలుచున్నారో ఆ శక్తిని, దానికి మూలమైన ఆది అంత్యరహితశక్తిని హేతువాదులు కూడా కాదనలేరు. శరీరములో శక్తి ఉన్నదని ఒప్పుకొనువారు ఆ శక్తికి ఆత్మశక్తి అనిపేరు పెట్టితే ఒప్పుకోక పోవడమేమిటి? అలాగే ఆత్మశక్తికి మూలమై, ఆత్మకంటే పరము (వేరు) గనున్న శక్తిని పరమాత్మ అనగా అదేదో అలర్జీలాగ మాకు ఆ మాట సరిపోదు మేము ఒప్పుకోము అంటే దానిని హేతువాదమంటామా? శరీరములో చైతన్యశక్తిని దైవశక్తి అని చెప్పితే ఎందుకు కాదనాలి? భగవద్గీతలో భగవంతుడు చెప్పినదంతా శరీరములో కరెంటులాగ పనిచేయు శక్తిని కాదా! గీతలో శరీరాంతర్గతముగనున్న శక్తి అంటే ఏమిటో, అది ఎట్లున్నదో, అది అందరి ఎడల ఎట్లు పనిచేయుచున్నదో వివరముగ చెప్పబడినది. యంత్రములో పనిచేయు శక్తి అయిన కరెంటును వివరముగ విజ్ఞానము (సైన్సు) ద్వారా చెప్పినట్లు శరీర యంత్రములో పనిచేయుశక్తి అయిన ఆత్మను వివరముగ విజ్ఞానము (సైన్సు) ద్వారానే చెప్పియున్నారు. యంత్రముల శక్తిని సైన్సు అన్నపుడు శరీరముల శక్తిని సైన్సని ఎందుకు అనకూడదు? 1) కరెంటు కనిపించని శక్తియే, ఆత్మయు కనిపించని శక్తియే. 2) కరెంటు ఒకచోట పుట్టినదే అదే విధముగ ఆత్మయు ఒక కేంద్రమునుండి పుట్టినదే. 3) కరెంటు యంత్రమును కదలించుచున్నది, ఆత్మ శరీర

యంత్రమును కదలించుచున్నది. 4) కరెంటు ఒక చోటినుండి మరొక చోటికి ప్రయాణించుచున్నది. అలాగే ఆత్మ ఒక చోటనుండి మరొక చోటికి ప్రయాణించుచున్నది. 5) కరెంటు ప్రయాణించుటకు లోహము అవసరము, అలాగే ఆత్మప్రయాణించుటకు శూణ్యము (ఆకాశము) అవసరము. 6) కరెంటుకు రెండు ధృవములు గలవు, అలాగే ఆత్మకూ రెండు ధృవములు గలవు. 7) కరెంటుకు ప్లస్ (+), మైనస్ (-) ధృవములు కాగా, ఆత్మకు ఉత్తర దక్షిణములు ధృవములుగనున్నవి. 8) కరెంటు అయస్కాంతము నుండి పుట్టగా, ఆత్మ అయస్కాంతమునకే అయస్కాంతమైన శక్తినుండి పుట్టినది. 9) కరెంటు రెండు ధృవములను కలిపితే అగ్గి పుట్టును. అలాగే ఆత్మయొక్క ఉత్తర దక్షణ ధృవముల కలిపితే అనగా కుడి ఎడమ శ్వాసలను కలిపి నిలిపితే జ్ఞానాగ్ని పుట్టును 10) కరెంటురీడింగు మీటర్లలో ఉండగ, ఆత్మ రీడింగ్ తలలోగల కర్మచక్రములో ఉన్నది. 11) కరెంటురీడింగ్ యూనిట్లలో ఉంటే ఆత్మరీడింగ్ పాపపుణ్యములనే యునిట్లలో ఉండును. 12) కరెంటుకు మెయిన్‌స్టేషన్ సబ్‌స్టేషన్ యున్నట్లు, ఆత్మకు పెద్దస్టేషన్ మెదడుకాగా, చిన్న స్టేషన్‌లుగ ఆరునాడీ కేంద్రములు ఉన్నవి. 13) కరెంటు సప్లై ఆగిపోతే యంత్రములో కొంత భాగము పనిచేయనట్లు, శరీరములో ఒక నాడీకేంద్రము నుండి ఆత్మశక్తి ఆగిపోతే ఆ కేంద్ర ఆధీనములో ఉండు అవయవములు కాళ్ళుగానీ, చేతులుగానీ పనిచేయవు. 14) కరెంటుశక్తిని తెలియవచ్చును కానీ అయస్కాంత శక్తి ఎట్టిదో దాని పుట్టుపూర్వోత్తర మేమిటో తెలియదు. అలాగే ఆత్మను తెలియవచ్చును గానీ దానికి మూలమైన పరమాత్మ ఎట్టిదో అదేమిటో కూడా ఎవరికీ తెలియదు. ఇట్లు ఎన్నో విధముల బయటి కరెంటుకు సమానముగ శరీరములోనున్న ఆత్మగలదు. శరీరములోనున్న శక్తిని ఆత్మ అనీ, దాని ఉత్పత్తి స్థానమును పరమాత్మ

అనీపేరు పెట్టుకొన్నాము. శరీరములోనున్న ఆత్మ అందరియందు ఒకే విధముగనున్నది. కావున హేతువాదులు తమ శరీరములోని శక్తిని గురించి ఆలోచించి దానిని కాదనగలిగితే దేవున్ని కూడా కాదనవచ్చును.

శాస్త్రబద్ధమైన హేతుబద్ధమైనది భగవద్గీత. ఆస్తికులమనుకొని యజ్ఞయాగాదులు, వేదాధ్యయణములు, తపస్సులు చేయువారిని భగవద్గీత పూర్తి ఖండించినది. మీరనుకొన్న మార్గములలో దేవుడు లభించడని కూడా చెప్పినది. ఎవడైనాకానీ శరీరములో పరిశోధన చేస్తే ఆత్మ తెలియబడునని, ఆత్మకు మూలకారణమైన పరమాత్మ ఎవరికీ తెలియదని కూడ చెప్పినది. ఇంతవరకు ఎవరుగానీ, ఏ మానవుడుగానీ దేవున్ని చూచినవారు లేరని కూడా చెప్పినది. దేవున్ని తెలుసుకోవాలంటే శరీరములోగల ఆత్మను తెలియమని, అదియే ఆత్మజ్ఞానమని కూడా చెప్పినది. బయట దేవాలయము శరీర నిర్మాణముననుసరించి తయారు చేసినదనీ, గుడిలోని ప్రతిమ శరీరములోని ఆత్మను అనుసరించి చేసినదనీ, బయట గుడిని అందులోని ప్రతిమను చూచినపుడు శరీరము అందులోని ఆత్మ జ్ఞప్తికి వచ్చునట్లున్నవనీ చెప్పినది. దేవాలయములోని ఆరాధనలు శరీరములోని ఆత్మను తెలుసుకొను సాధనల రూపమని తెలియవలెను. ఆస్తికత్వము పూర్తిగ భగవద్గీతలో ఇమిడియుండగా, శరీరములో పరిశోధించక గీతకు వ్యతిరిక్తముగ యజ్ఞ యాగాదులు, వేదపఠనములు, తపస్సులు చేయువారు ఆస్తికులుగారు. అలాగే శాస్త్రీయత, హేతుబద్ధత పూర్తిగ భగవద్గీతలో ఇమిడియుండగ, భగవద్గీతనే కల్పితమని దానికి వ్యతిరిక్తముగ ఆత్మ, పరమాత్మ లేదనువారు నాస్తికులుకారు, హేతువాదులు కారు. ఇప్పుడున్న ఆస్తికత్వమునకు, నాస్తికత్వమునకు భగవద్గీత వ్యతిరేఖముగ ఉన్నదనీ, విజ్ఞానములలోకెల్ల విజ్ఞానమైన గీత ఈనాటి హేతువాదులను, ఆస్తికవాదులను ఏమాత్రము

ఒప్పుకోదని తెలియవలెను. ఇప్పటికైనా తమకున్న విశ్వాసమేమిటో (నమ్మకమేమిటో) ఆస్తికులు, అలాగే తమకున్న అవిశ్వాసమేమిటో హేతువాదులు పునరాలోచించుకోవలెనని కోరుచున్నాము. నిజమైన ఆస్తికత్వమునకు, నిజమైన హేతువాదముకు, సరియైన వేదిక శరీరమనీ, దానిలోని పరిశోధనే నిజమైన విజ్ఞానమనీ (సైన్సని) తెలుపుచున్నాము.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

## రచయిత చివరి మాట

ద్వాపరయుగములో దేవుని ధర్మములకు ముప్పు ఏర్పడినది. ఆనాడు గల మునులు, మహర్షులు దైవమార్గములను వదలి మాయ ధర్మములైన యజ్ఞయాగాదులు, జపతపములు, వ్రతక్రతువులలో లగ్నమై పోయారు. దైవభక్తి అంటే మహర్షులు, మునులు చేయు ఆచరణలేనని ప్రజలు నమ్మి వారినే అనుసరించారు. ఇది సరియైన మార్గమని చెప్పు వారు లేకుండా పోయారు. అట్టి పరిస్థితిలో మానవునికి హద్దు (గీత) అను పేరుతో ధర్మములను దైవము తెలియజేశాడు. ఆ విధముగ తెలియ జేసినప్పటికీ నేటి మానవుడు గీతను కూడా అతిక్రమించి పూర్వము పరిస్థితికంటే ఎక్కువగా దిగజారిపోయాడు. విశ్వమంతటికీ మూల కారణమైన దేవున్ని విస్మరించి తమ కిష్టమొచ్చిన దేవతలను తయారు చేసుకొంటున్నాడు. 5260 సంవత్సరముల పూర్వము ద్వాపరయుగములో లేని మతములు నేడు తయారైనవి. ఎవరి మతమును వారు, ఎవరి

దేవున్ని వారు గొప్పగా చెప్పుకోవడ
వారికి అందరికీ దేవుడొక్కడేనని చెప్పి
దైవవ్యతిరేఖమైన మాయ మానవుల
భక్తి అని వారిలో గాఢముద్రవేసిం
విశ్వాసులమని భ్రమింపజేసి దేవుని
మరికొంతమందికి దేవుని మీద విశ్వా
రేకెత్తించి కొందరిని నాస్తికులుగా,
వేసింది. ఇలా మానవులు దేవుని ప
రెండు రకములుగ కనిపిస్తున్నప్పటికీ
అయ్యారు. ఇటువంటి పరిస్థితి వస్త
మీదకు వచ్చి తిరిగి ధర్మములను
దేవుడు ముందే చెప్పాడు. దేవుని ధర
ఈ సమయములో, అన్ని మతముల
ప్రతినిధులున్న ఈ కాలములో, దేవు
మానవుడు లేడు. దేవుని మాటనే లెక్కి
నమ్మకము లేదు. అయినా సత్యము
అతీతులైనవారు గ్రహించగలరని న

ఇట

త్రిమత ఏకైక గురువు,

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధ**

---

**అసత్యమును వేయిమంది చె**

**సత్యమును వేయిమంది కాదని**

మము జరుగుచున్నది. అటువంటి
నా వినేస్థితిలో లేరు. ఈ విధముగా
లో చోటుచేసుకొని మీదే అసలైన
ది. ఈ విధముగ కొందరిని దైవ
నికి దూరము చేసింది. అలాగే
్వాసమే లేకుండా అనుమానములను
కొందరిని హేతువాదులుగా మార్చి
ట్ల విశ్వాసులు, అవిశ్వాసులు అను
దేవుని లెక్కలో అందరూ అవిశ్వాసులే
స్తుందనే నేను అప్పుడపుడు భూమి
నెలకొల్పవలసిన అవసరమున్నదని
ర్మములకు అతి ప్రమాదము ఏర్పడిన
లో జ్ఞానులమను పేరుతో మాయ
ుడే వచ్చి చెప్పినప్పటికీ వినేస్థితిలో
ంచని వారు మా వ్రాతను లెక్కిస్తారని
తెలుపుట నా కర్తవ్యము. మాయకు
మ్ముచున్నాము.

ట్లు
త్రైత సిద్ధాంత ఆదికర్త
**వానంద యోగీశ్వరులు**

---

**ప్పినా, అది సత్యము గాదు,**
**ినా, అది అసత్యము గాదు.**

# హిందూ రక్షణా! 

## భగవద్గీతయే చదవనివా

### హిందూ ధర్మమే తెలియని

హిందువులు నేడు కులాలుగ
కులములుగా వర్ణించబడియున్నారు
దేవుడు మనుషులందరినీ సమానము
తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ)
చీల్చి, బలహీనపరచి హిందూసమాజ
తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని
చేసుకొన్నారు. ఎన్నో కులములుగా
కులమే అగ్రకులమని చెప్పుకోవడమే క
తామే మార్గదర్శకులమనీ, గురువులవ
తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు
కులములను చేసి, హిందూ సమాజ
అంతటితో ఆగక నేటికినీ హిందూ
హిందూ సమాజమును సర్వనాశనవ
ఇతర మతములుగా మారిపోవుటక
అటువంటివారు హిందూ సమాజ
మిగతా కులముల వారందరూ వారి
చెప్పినట్లే వినుట వలన, హిందూ సమా
అధర్మ మార్గమువైపుకు మళ్ళించి,
తెలియకుండా చేసి, తాము చెప్పున

# హిందూ భక్షణా!!

## ఒడు హిందూ రక్షకుడా?

## వారు హిందూ రక్షకులా?

గా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు అనుట అందరికీ తెలిసిన సత్యమే. గా పుట్టించితే కొందరు మనుషులు ) సమాజమును ముక్కలు ముక్కలుగా మునకంతటికీ తామే గొప్పవారమనీ, కార్యములు చేసుకోవాలనీ ప్రచారము మున్న హిందూ సమాజములో తమ కుండా, ఇతర కులముల వారందరికీ నీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో , అన్ని కులములను అంటరాని మునకు తీరని అన్యాయము చేశారు. సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, ు చేయుచూ, హిందూ సమాజము పు మొదటి కారకులగుచున్నారు. మునకు చీడ పురుగులుగాయున్నా, నిజ స్వరూపమును తెలియక వారు జమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును దే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక,

అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును

కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్ఠికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్ఠికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్ఠి పుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది

నుండి 'సృష్ఠికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము.

'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**



ప్రముఖుల లేఖ

(సాక్షి న్యూస్‌పేపర్, 21-01-2014)



# ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,
ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే
దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.

**భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు ఒకే దైవగ్రంథములోని భాగములే.

మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే "ప్రబోధ సేవాసమితి" లో

సభ్యులుగా చేరండి. దేవుడు మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...



--- శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

ఫోన్ : 09948947630, 09491040963, 09440556968

# నాస్తికులు - ఆస్తికులు

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు
























































































